# మమకారం

రావూరి భరద్వాజ

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# కారుణ్యం

ఆకాశంమీద సాగిలబడ్డ సాయంత్రం మబ్బుల ఆఖరి ముదురుపచ్చ మెరుగూ, బాగా కళ్ళు తెరవని చంద్రవంక మూగ కాంతీ, పచ్చగన్నేరు గుబుర్లనుండి చాచుకువొస్తున్న చీకటి నునుపూ, గుళ్ళో దీపాల వెలుగుల చెదురుడు మధ్య ఆమెను చూశాడు గోపాలరావు. చప్పున అతనికి సనాతన పద్ధతులమీదికి అపేక్ష వొచ్చింది. దేవాలయాలు వుండటం ఎంతమంచిది, ధైర్యమున్న పురుషులకు? పగలు బైటికిరాని సౌందర్యరేఖలన్నీ అందాలుగా తయారయి వొస్తాయి, గుళ్ళల్లోకి, పాపాలు పోగొట్టుకొని, పుణ్యం సంపాదిద్దామని.

ఆమె ప్రత్యేకం అందరిమధ్యా గోపాలరావుకి. అతని చూపులు ఆమెను వొదిలిగావట్లేదు. చేతిలో ఇత్తడి పూల బుట్ట. దాంట్లో కాయలు, కర్పూరం, జమ్మిపత్రి, పూదువత్తులు. గోపాలంగూడా గుళ్ళోకివెళ్ళాడు ఆమెవెంట ఆమెకోసం. ఇటు తిరగదు. చూడదు. దీపాల వెలుతుర్లో మరీ స్పష్టం ఆమె. ఎరుపు మెరుగులోనించి, తెలుపు నీడలోకి మారే దేహచ్ఛాయ, గుండ్రటి భుజాలు, పమిటగట్టితనం. పెద్దపువ్వుకుమల్లే మెరిసే మొఖం. ఆకుపచ్చని రెవికలోనించి, ఆకాశంమీదికి చాచుకొన్న వెలుతురు గీరలకుమల్లే రెండుచేతులు. మెడమీద పడే చీకటిజుట్టు, చెంపలమీదికి కొంచం జరిగి. తలలో రెండు ఎర్ర గన్నేరు పూలు, తులసీదళాలు కాసిని.

ఆమె ధ్యానం దేవుడిమీదా, పూజమీదా. చుట్టూ ఏంజరుగుతోందో ఆమెకు తెలీదుగావును. అవసరంలేదేమో

గూడా! ఎప్పుడో, ఏజన్మలోనో, వొదిలివొచ్చిన తపస్సును, ఇప్పుడుయిట్లాతీర్చుకొంటోందేమో! ఏంవరం ఆమెకు కావాలి? ఏస్వప్నప్రియుడి కోసమో ఈపూజ, ధ్యానం? ఇదీ గోపాల రావుకి ఆమెమీద ధ్యానం. అతనికి కోపం చుట్టూ జనంమీద. ఈపురుగులన్నీ ఆమెని తాకటమేమిటి? తనొక రాజకుమారుడై కత్తి తీసుకొని, ఈజనాన్ని, ఆమెని తాకకుండా ఆపితే! ఆమె గుళ్ళోకి రాబోయ్యేముందు, ఇంకెవరూ రాకుండా ఆజ్ఞ పెడితే! వాడు—ఆ దేవుడు ఏంచేస్తున్నాడు? ఈమెప్రార్థన వినపట్టంలేదా? డబ్బుకోసం, వ్యాపారంలో లాభంకోసం, కోర్టులో గెలవటం కోసం, బర్రె తన్నకుండా పాలివ్వటంకోసం, తనను చచ్చేట్టు తన్నిన పగవాడి పెద్దకొడుకు చావటంకోసం, టైఫాయిడ్ జబ్బు మందు లేకుండా కుదరటంకోసం, తమవాళ్ళకు ఎదటివాళ్ళను ప్రేమించే రొమాంటిక్ సెన్స్ లేకుండా వుండటంకోసం, వందల మంది క్షుద్రులు పెట్టే కేకల్లో ఈ మధురగానం వినపట్టంలేదా ఆ దేవుడికి? ఇట్లాంటిఆమె తనదగ్గిరికి రావటం చాలుగదా చప్పున ఏవరం ఇవ్వటానికైనా? ఇంకా—ఇంకా—ఇంతసేపు కళ్ళుమూసుకొని వున్నా వాడు పలకనట్టుందేం! అసలు వున్నాడా? వుండే వినిపించుకోవటం లేదా? వినిపించుకొన్నా చెయ్యటానికి ఆమెలో అర్హత కనిపించటల్లేదా? తనే దేవుడైతే...?

ఐపోయింది గాపును పూజ, కర్పూరం వెలిగించింది. ఆమెచూపులు గుళ్ళోయిత్తడిదేవుడి వేపు అతనిచూపులు ఆమె పెదిమలమీదా, మెల్లగా పాకుతో రొమ్ములదాకా వొచ్చి ఆగిపోయినాయి అక్కడ, కదలకుండా. నల్లవొంపుల

గట్టిజుట్టులో ఆమెముఖం—సముద్ర నీలజలాలలో ప్రతిఫలించే చంద్రబింబం అతనికి. మెళ్ళోహారమూ, చెవలఅంటుజోడు తళుకులూ నక్షత్రాల మినుగురులు.

ఆమె వెనక్కితిరిగి వెడుతోంది, ఎటూచూడక, ఎవరికీ సంబంధంలేకుండా. స్వప్నంలో గానం వింటో తన్మయుడై పోతున్నవాడికి నిద్రాభంగమైతే పడేబాధ అతనికి. ఆమెకు తెలీదు తన సౌందర్య ప్రతిభ. తెలిసే తెలీనట్టు పోతుందోమరి? మొత్తం మీద వెడుతోంది. పచ్చగన్నేరు పొదలమధ్య ద్వారంవేపుకు. ఆమె యిల్లు అటే గావును...

ఇంతే ఆఖరా ఆమెను తనుచూడటం? మళ్ళీమళ్ళీ వొస్తుందా? పదిసంవత్సరాలకిందట మాయమైపోయిన దేవుడిమీద భక్తి, చప్పున అతనిలో కొచ్చిందిమళ్ళీ. వెనక్కివొచ్చి, లేని భక్తినంతా కూడగట్టుకొని దేవుణ్ని ప్రార్థించాడు, ఆమెను రోజూ గుడికిరప్పించమని. ఇక్కడికి రావటానికి వీల్లేకపోతే, ఆమెని చూడటానికి—ఏమీ అభ్యంతరం కలగని మరొకచోటికైనా ఫర్వాలేదు.

ఆ రాత్రల్లా అతనికి అదే ఆలోచన. మర్చిపోదామని ప్రయత్నంచేశాడు. చేస్తున్నకొద్దీ ఆమె రూపం మరీ బిగ్గరిగా పలుకుతోంది. ఎట్లాగైనా మరొకసారి ఆమెను కనిపించేట్టు చెయ్యమని భగవంతుణ్ని ప్రార్థించాడు. (చాలా సహజంఇది. ఎక్కడో, ఎప్పుడో, ఎవరో అరుదుగాతప్ప—పరిస్థితులకు రాతనూ, విధినీ, దేవుణ్ని తోడుచేసుకోక తప్పదు) తనకు కలిగే కష్టసుఖాలకు బాధ్యత తమదీ, పరిస్థితులదీ అనే సత్యాన్ని భరించటంలో ఎంతబాధవుంది? తను అసమర్థతను కప్పిపుచ్చుకోవ

టాని కే ఇవన్నీ ఏర్పడ్డాయని చెప్పేవాళ్ళమీద ఈ జనానికి ఎంతకోపం!

భగవంతుడు అతని ప్రార్థన ఆలకించాడేమో మరి— మొన్నాటి సాయంత్రం, అతను సగం దిగులు సగం అనుమానం. కాస్త ఆశ, సంతోషంతో గుళ్ళోకివొచ్చాడు. ఆమె మూలగా దేవుడుముందు నిలబడివుంది. నిన్నటికంటే ఎక్కువ ఆకర్షంగా, అందంగా అవుపించింది ఆమె వొళ్ళు. అట్లాగే నిల్చుండిపోయ్యాడు. చుట్టూ ఏమవుతోందో అతనికి తెలీదు. కలలు కంటున్నాడు. ఆమెచుట్టూ కలలు. ఆమెనుండి కలలు. ఆమెలోనించి తనలోనికి కలలు.

[భగ్గున అతని కళ్ళముందు పొగలేచి మెత్తగా వొంపులు నొక్కుతో సాగిపోయింది. సూర్యుడి పసిడికిరణాలుపడి మెరిసే మంచు ముత్యాల సప్తవర్ణాల మెరుపులు పొగనిండా లేచాయి. అన్నీ మెరుపులు. మిణుగురు పురుగుల్లాంటి మెరుపులు. వాటి మీద అందంగా పడుకొనివుంది ఒకమ్మాయి, తలకింద చెయ్యి పెట్టుకొని. ఆమె పెదిమలమీద దయ: మొఖం సాయంత్రం మబ్బుల పచ్చకాంతి. తెల్లని నీడలు మెడనుండి జారుతో వొచ్చి, పాదాలదగ్గిర వలయం తిరిగినాయి. చీకటి గుహల్లో ప్రతిధ్వనించే ఈదురుగాలివంటి జుట్టు.)

"రా" అన్నది ఆమె చేతిని కొంచం ముందుకు సాచి అతన్ని.)

"ఎవరు?" అన్నాడు గోపాలం.

"నువ్వే—నువ్వే—రా"

"..............."

("నేను తపస్సుచేసింది ఎవరికోసమనుకొన్నావు? ప్రతి రోజూ గుళ్ళోకి రావటం ఎందుకనుకొన్నావు? నువ్వు, నువ్వు, నువ్వుకావాలి, నీకోసం. అనంతకాలంనుంచీ నేను పుట్టటం—నాప్రాణం—నిజం—నీకోసం. ఎప్పుడో పాపం చేశానుట. నువ్వు నాజీవానివి. నాభావానివి" అంటో ఆమె, ఆ రంగుల చిన్నచిన్న మెరుపులపక్కమీాదికి లాగి, చేతులుచాపి, అతని మెడవెనక వేళ్ళుకలిపి, బలంగా వొత్తుకొంది తనవేపుకు)

(అతని కళ్ళు మూతలుపడ్డాయి. చేతివేళ్ళలోనించి, కళ్ళలోనించి, పెదిమలలోనించి అతనిలోకి సంతోషప్రవాహం పడుతోంది)

"(ఇందుకే—ఇందుకే నేను తపస్సుచేసింది. నీకంటే ఏ ఒకటిమాత్రం ఏం ఎక్కువ ఈలోకంలో? ఈ పెదిమలు చాలు నా అనంత ఆరాధన సఫలంకావటానికి" అంటో ఆమె అతని పెదిమలు చెంపకు ఆనించుకుంది. తనొక గొప్ప మెరుపు. ఆమొక గొప్పమెరుపు. వాళ్ళిద్దరు అట్లా కళ్ళు మూసుకొని అల్లుకొనివున్నారు. చుట్టూవున్న చిన్నచిన్న కాంతిఖండాలు సంతోషరవాలు చేస్తున్నాయి. వేగంగా, మహావేగంగా తిరుగుతున్నాయి. ఆ ప్రళయవేగంలో ఏది ఏరంగు మెరుపో తెలియదు. సప్తవర్ణ సమ్మిశ్రిత మహార్ణవం. ఇద్దరూ ఆ కాంతి పుంజంలో కరిగిపోయినారు.).

గోపాలరావుకు స్మృతి వొచ్చేప్పటికి కర్పూరపుకాంతి తగ్గిపోతోంది. ఆమె హారతిచ్చిన కర్పూరకాంతి. తిరిగి వెడుతోంది. చీకటిమీాద పలచగా పారుతున్న వెలుగులో ఆమె తనవేపుచూసినట్లైఅనిపించింది గోపాలరావుకి. వెడుతో వెడుతో

ఆగి వెనక్కి—చూసి, తలొంచుకున్నట్టనిపించింది. చీకట్లోకూడా మెరిసేకళ్ళు తనను తొరతొరగా రమ్మనిపిలుస్తున్నట్లు అనిపించి ముందుకుపోయ్యాడు. ఆమె లేదు. అప్పటికే బైట పచ్చగన్నేరు పొదలవేపుకు వెడుతోంది. నాలుగడుగుల్లో గన్నేరు గుబుర్ల వద్దకు వెళ్ళాడు. ఆమెవొంటి అందాన్నంతా పచ్చ మెరుగుగా మార్చుకొన్న గన్నేరుపూలు వెన్నెట్లో నవ్వాయి. ఆమె ఆ గుబుర్లలో లేదు. ఎంత వెదికినా కనిపించలేదు గోపాలానికి.

దిగులుగా యింటికొచ్చాడు. సరిగ్గా నిద్రపట్టదు. యిల్లంతా చికాగ్గా కనిపించింది. ఓపిగ్గాసర్దాడు. రోజూ తనకు అందంగా కనిపించే హిందీస్టార్ల ఫోటోలు రోతగాఅవుపించాయి ఏభంగిమలో పెట్టినా అవి అసహ్యమే! మంచంమీద అటూ ఇటూ పొర్లాడాడు. వొంటిచితచిత పోవటానికి స్నానంచేశాడు. చికాకు వొంటిమీద కాదుగా పోవటానికి? మనసులో. మనసు స్నానం చెయ్యాలి!

తను ఆమెను చూడకుండావుంటే బాగుండేది, ఈగిజాటు బాధ వుండదు అప్పుడు. ఎందుకు ఆమెబొమ్మ తనకళ్ళల్లో కనిపించటం? ఆమెను తను తాకాలనీ, ముద్దుగా వొంటిమీద నల్ల మెరుపులకుమల్లె మెరిసే వెంట్రుకలు సరిచెయ్యాలనీ, భుజాల నుండి, రొమ్ములమీదుగా జారి, పిరుదులదగ్గర మళ్ళీవొంపులు దిరిగి, ముందుకుపోతున్న అందాలు తనకు కావాలని ఎందుకు తన మనస్సు బాధపడుతోంది? పరస్త్రీమీద మోహం కలగటం పాపమంటారు. మరి ఆమె—ఆ దేవకన్యమీద తనకు మోహం కలుగుతుందేం? కలగటం తప్పా? మనిషిగా [illegible]నతరవాత, అందానికి ఆర్ద్రమైపొయ్యే హృదయాన్ని పెట్టి, హృదయం

తన్మయపడే అందాలను కలిగించి ఆకర్షణ వుండకూడదనటం ఏం భావ్యం? అందాన్నిచూసి ద్రవీభూతం కానివాడు గాడు. అదితప్పా? తప్పయితే యిట్లా కలుగుతోందేం మరి? "తప్పు" అని శాసించే దేవుడు, తప్పుచేసిన తరవాత శిక్షించే దాని కంటే, ముందుగా, తప్పుచెయ్యకుండానే ఎందుకు అడ్డుపడడు?

(గోపాలరావు పగలల్లా అనుకొంటాడు సాయింత్రం ఆ గుడివేపు పోకూడదని. అంతే! సూర్యుడు కొండ వెనక్కు జారుతున్న కొద్దీ, మబ్బులు తెలుపు రంగును వొదిలి, పసుపుగా, ఎరుపుగా మారుతున్న కొద్దీ, క్షితిజం నుండి చీకటి పెరిగి అల్లుకొంటున్న కొద్దీ అన్ని నిశ్చయాలూ, ప్రతిజ్ఞలూ, వొట్లూ పోయి మామూలు మనిషి అవుతాడు. ఇక నిలబడవు కాళ్ళు. ఎక్కడ, ఎంత దూరాన వున్నా అతని శరీరాన్ని మోసుకొచ్చి గుళ్ళో ఆమె సామీప్యాన చేరుస్తాయి. అప్పటికి వాటిపని అయిపోతుంది. కళ్ళు ఇంకేంచూడవు ఆమెని తప్ప. మనస్సు ఆమెని కావిలించుకొంటుంది.)

మొదట్లో ఆమె దినదినం గుడికి విడవకుండా వొస్తుంటే చాలనిపించింది. ఇప్పుడు వూరికే రావటం బావుండటల్లేదు అతనికి. తనవేపుచూడాలి. ఆమె తనను చూస్తున్నట్టు, తనకు తెలిసేట్టు చూడాలని గోపాలరావు కోరిక. నిజంగా చూస్తుందేమో అతనికేం తెలుసు? ఈ భౌతికనేత్రాలతో గాక, మనోనేత్రాలతో చూసేశక్తి ఆమెకి వున్నదేమో అతను ఆలోచించడు. అయినా ఏంగొప్ప అతను? ఎవరికంటే గొప్ప? ఆమె వూరికేచూస్తే సరిపోతుందా? ఇప్పుడు చాలవొచ్చు. చూసింతరవాత! "ఓస్ యింతేనా?" అనిపిస్తుంది. చూసి

మెచ్చుకోవాలి. మెచ్చుకొన్నట్టు పైకి కనిపించాలి. అప్పుడు అతనికి సంతుష్టి. ఆ పునాదులమీద సౌధం కడతాడు, అంతస్తు లంతస్తులుగా, అందాలుగా. స్త్రీ కొంచంగా ఏకోణంనుంచైనా పురుషుణ్ని దయగా చూసిందా, ఆ మొగవాడి తిప్పలకు అంతం వుండదు. అతను కల్పించుకొనే మేడలకు ఈ భూగోళం చాలదు. అతనిమీద అతనికి అనంతమైన ప్రేమ కలుగుతుంది. అందం, శౌర్యం, ధనం, తెలివితేటలు అమూల్యమై, అపురూపమైపోతాయి తనవి తనకే! ఆచనువు పట్టుకొని, పాకి, ఆమె నంతా ఆక్రమించి, సొంతం చేసుకొని, తనలోకి తీసుకోవటానికి తోవలు వెదుకుతాడు.

తనమీద తనకే శ్రద్ధపోతోంది. ఆమెను కదిలించలేని తన అందం నిరర్థకం. అన్నం సయించదు. కాఫీ సయించదు. నిద్రపట్టదు. అశ్రద్ధ అతన్ని ఆక్రమించింది. స్నానం చెయ్యడు. రోజురోజూ అతనిలో దిగులు ఎక్కువవుతోంది. అట్లా—ఆవిధంగానే గోపాలరావు గుళ్ళోకి వొస్తుంటాడు, రోజల్లా ఎక్కడ, ఏ పనిమీద వుండనీ.)

ఒకరోజు అతను గదిలో పడుకొని వున్నాడు, రాత్రి పొద్దుబోయి. నిద్రరాదు. అటూ ఇటూ మసులుతున్నాడు. ముందుగది బైట అడుగుల చప్పుడు. తరవాత కిటికీ తెరిచి ఎవరో అతన్ని కాసేపు చూసి తలుపు కొట్టారు. గోపాలరావు తలుపు తీసేసరికి ఎవరో ఆడమనిషి చప్పున లోపలికొచ్చింది.

"ఎవరు?" అన్నాడు.

"నేను..." బిడియం గొంతులో.

"ఎవరు?"

"ఆమె... ఆమె తెలీదా?"

వెంటనే గోపాలానికి తెలిసిపోయింది. ఆమె అంటే అతని నిఘంటువులో ఇటీవల 'గుళ్ళోకనిపించే ఆమె' అన్న మాట. ఆమెతప్ప మిగతా స్త్రీలు "ఆమెలు" కారు ప్రస్తుతం అతనికి.

"ఏమిటి ఆమె? ఏంకావాలి?" అన్నాడు, ఏదైనాసరే త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డ గొంతుతో

"ఏం వొద్దు..."

మాట పూర్తికాకముందే అతను నిరుత్సాహపడ్డాడు, అయ్యో ఎటువంటి ఘనకార్యం చెయ్యడానికీ, వీల్లేక పోయిందే అని.

"ఈ చీటీయిచ్చింది. మీరు రాత్రికిగుళ్ళోకి రావాలి."

ఒక్కగంతులో గదిలోనుండి బైటికిదూకి తొరతొరగా వెళ్ళిపోయింది. కళ్ళముందు పెద్దమెరుపు రెండుక్షణాలు మెరిసి మాయమయినట్లుంది అతనికి. ఆ వొచ్చిన మనిషిని పట్టుకొని ఎన్నెన్నో అడగాలనిపించింది. ఆమెకు తనమీద ప్రేమ ఎప్పణ్నించి వొచ్చింది? తనను మొదటిరోజున చూసేనా? రెండో రోజునా? రోజుకు తనుఎన్నిసార్లు జ్ఞాపకమొస్తుంటాడు? ఇట్లాంటివి అడిగి తెలుసుకోవాలి. తెలుసుకొని సంతోషించాలి. చాలాకాలం నుండి బాధపడుతున్నానని చెబితే సంతోషం. పొద్దుణ్నించీ నంటే దిగులు.

కాగితం విప్పి చదివాడు. ముత్యాలకోవలకు మల్లే లేవు. చీకిరి బీకిరిగా వున్నయ్ వొంకలుగా. అవే అతనికి ముత్యాలకోవలు. ఇంకో అభిప్రాయం గూడా గోపాలానికి

కలిగింది. ఇట్లా వొంకులుగా, సరిగ్గా తెలుసుకోవడానికి వీల్లే కుండా వున్న వే ముత్యాల కోవలవుతాయనీ, మిగతావి కావనీ)

"రాత్రికి రండి గుళ్ళోకి. పచ్చగన్నేరు పొదల నావ రాయి దగ్గరకు. తప్పక...రాజేశ్వరి." ఆ గీతల్లో అతనికి అజంతా శిల్పమూ, ఎల్లోరా సౌందర్యమూ, తాజ్‌మహాల్ కాంతీకనిపించాయి. క్షణకాలం రాజేశ్వరి ఆమాటల్లోకనిపించి 'తప్పక రండి' అన్నది అతనికళ్ళకి.)

వెళ్ళాడు ఆమె ఆజ్ఞ ప్రకారం. నావరాయి దగ్గిర కూచున్నాడు. కొత్తగా సినిమా చూడబొయ్యే పిల్లవాడి వుత్సాహంతో. అన్నీ అనుమానాలు. రాదేం? ఇంకా ఆలస్యం చేస్తుందేం? దోవతప్పిపోయిందా? రాత్రిపూట, ఆ పొదాలకు రాళ్ళు—వెధవరాళ్ళు—ఎన్నితగులాయో? మునిసిపాలిటీవాళ్ళకు బుద్ధిలేదనే విషయం వెంటనే తెలిసింది గోపాలరావుకు. ఆమె వొంటిమీద జాగ్రత్త అతనికి కలుగుతోంది. పొరబాటుపడ్డ దేమోనని గుడిచుట్టూ రెండుసార్లు ప్రదక్షిణం చేసివొచ్చాడు. అనవసరంగా చుక్కలు లెక్కపెట్టాడు. గన్నేరు పొదలదాకా వెళ్ళి కాసేపు నిలబడి, వెనక్కు తిరిగి, మళ్ళా ముందుకు నాలుగడుగులు వేశాడు.

(గన్నేరు గుబుర్లలో మిణుగురులు కాలిపోతున్నాయి. దూరంగా వున్న మర్రిచెట్టుమీద కొంగలగుంపు, చెట్టుకప్పుకొన్న తెల్లముసుగులావుంది. ఆకాశపు గతుకుల్లో నిలవుండి పోయిన వెన్నెల జలాలకుమల్లే నక్షత్రాలు మెరుస్తున్నాయి. గాలి తెరలు చెరువులోనించి చేపలవాసనా, కప్పల అరుపులూ

మోగుతున్నాయి. గోపురం నెత్తిమీదుగా, వెన్నెలతో నిండిన మబ్బులు కొండ వేపుకు జరుగుతున్నాయి.

క్షణంలో తులసీదళాల వాసనా, గుడిలోని వెన్నెలకు పచ్చ మెరుగూ వొచ్చింది, మంచుదుప్పటి కప్పుకొన్న పచ్చ తంగేడు పొదకుమల్లే రాజేశ్వరి రావటంతో. ఆమె భూమి మీద నడుస్తున్నట్టులేదు. కలలో, గాలిలో నడుస్తున్నదానల్లే వుంది.

చంద్రుడికి మబ్బు అడ్డంవచ్చింది. గోపురం గూళ్ళలోని గబ్బిలాలు అరిచాయి.

రాజేశ్వరి తెల్లనాపరాయి చివర కూచునివుంది. గోపాలరావు దగ్గరగా జరిగాడు. అతని చూపులు ఆమెకళ్ళనుండి లోపలికి. చేతులు వొణుకుతూవున్నాయి. నెత్తురు పదును. వొంటినిండా మోహపు బలుపు.

"ఎంతకాలం...ఎన్నిరోజులు ... అదృష్టం..." అని గొణుగుతున్నాడు, మాటలు సరిగ్గా రావు.

"ఉండు. తాకబోకు. తప్పు" అన్నది రాజేశ్వరి పసిపాపకుమల్లే.

ఆగాడు. అయితే ... అయితే...ఎందుకు? రావటం ఎందుకు?

"ఎందుకు? ఏంతప్పు చేశాను నేను? నేనేనా చేసింది? ఇంకెవరన్నానా? వాణి...వాణ్ని.....నరుకుతా. బూడిదచేస్తా. చాణుక్యుడికిమల్లే నీళ్ళల్లోకలిపి తాగుతా. ఏమిటి?" అన్నాడు గోపాలరావు ఆమె బుగ్గలు మెత్తగా తాకుతూ.

(యుగయుగాలనుండీ అందాలు మనస్సుల్లో కలవరపెట్టి, అమోఘమైన త్యాగాలు, వీరకృత్యాలు, యుద్ధాలు, మహా తపస్సులు చేసిన పురుషరక్తం అతనిలో కలవరపడ్డది స్త్రీ కోసం. స్త్రీ నీచురాలనీ, ఆమె అందం బుద్బుదప్రాయమనీ, మాంసం, చీమూ, నెత్తురూ కలిసిన తోలుతిత్తులనీ, ఆ కాంతి, మెత్తదనం, కలలు రేపటం వొట్టిమోసమనీ, రాసేవాళ్ళు, దీన్నే పరమపవిత్రంగా వర్ణించారంచేసే వేదాంతులూ, ఈగాథ లకేం చెబుతారు? వొట్టిమోసం, దగా, అబద్ధం కావొచ్చు, వోపిక చచ్చి, అలవాటుపడి, కొత్తదనం నశించిపోయిన తర వాత. కానీ అప్పుడు అది నిజమే! ఆ శాస్త్రకారులమూ, అబద్ధా లయితేనేం? స్వర్గంలోకి తీసికెళ్ళే మాధుర్యధ్వనులు, మంజుల సంగీతరుతాలు అప్పటికి. ఏది నిజం? ఏది అబద్ధం?)

' నేను పాపిని. నన్ను తాకవొద్దు" అన్నది

(ఆ నిమిషాన తను ఎటువంటిదైనా గోపాలరావుకు అభ్యంతరంలేదని ఆమెకు తెలీదు. ఆమెఅన్నితప్పుల్నీ క్షమించ టానికి సిద్ధపడ్డ కారుణ్యాహృదయు డయ్యాడు గోపాలరావు. అందుకే పగలల్లా పోట్లాటలు, తిట్టుకోవటం, అసహ్యించు కోవటం, జుట్టుపట్టుకు యీడవటం, ఆకలి, దరిద్రాలు, అసహా యత్వంతో గడిచినా రాత్రి—చీకటిలో—ఆ స్త్రీ పురు షుల మధ్య అన్నీ పోతాయి. పురుషుడే ఆ నిమషాన, పగలు జరిగినవన్నీ మరిచిపోయి, ఆమెను భిక్షమెత్తుతాడు. క్షమాప ణాలు కోరే ఘడియలూ వుండవచ్చు. పగటి కసినంతా బెట్టుతో, ధీరత్వంతో, అసమ్మతి ప్రకటనలతో తీర్చుకొని స్త్రీలు తమ ఆనందద్వారాలు తెరుస్తారు పురుషులకు, హృద

యంలో. లాలించి, బెల్లించి, అనునయిస్తారు. ఇదే లేకపోతే పురుషులంతా రాక్షసులూ, క్రూరమృగాలూ అయిపోయే వారే! సృష్టి ఈ మహావరాన్నే స్త్రీలకు ప్రసాదించకపోతే, కీటకాలకంటే హీనమై, నిలవనీడలేక ఎప్పుడో జాతిమొత్తమే నశించివుండేది.)

"కాదు. నువ్వు దేవతవు" అంటున్నాడు.

"కాదు"

"(మొదట్లో మిమ్మల్ని చూశాను. సంతోషంగా కని పించారు. ఆ తరువాత రోజు రోజుకూ మీరు పాడయిపోతు న్నారు, ఎందుకు?" అన్నది తనలోతను అనుకొంటున్నట్టు తల వొంచుకొని.

కీచురాయిపాట ఆగిపోయి సన్నగా మంచుపడుతోంది. మంచులో స్నానంచేసిన వెన్నెల నిర్మలంగా నవ్వుతోంది. చుట్టూ తడిగడ్డిమీద వెన్నెలనీడలుపడి మెరుస్తున్నాయి.

"తెలీదా నీకు? నీకోసరం తపస్సుచేస్తున్నాను? ఎన్ని తపస్సులు చెయ్యానిదే ఈకాంతి నాకుచిక్కుతుందీ!" అన్నాడు గోపాలరావు ఆమెగడ్డాన్ని పట్టుకొని ముఖం వెన్నెలవేపుకు ఎత్తుతూ.

("ఎందుకు తపస్సు చెయ్యటం? ఏముంది నాలో? మల మూత్రాదుల కూటమి యిది. వొట్టితోలు")

("నీకు తెలీను. నన్ను అగ్నిలో కాల్చిందీ, కత్తులతో కోసిందీ, మలమూత్రాదుల కూటమికాదు. అయినా—ఇదే నన్ను బాధించింది" అన్నాడు ఆమెభుజాలుపట్టుకొని ముందుకు

వొంగుతూ. బలిపీఠం మీది యజ్ఞపశువు స్థితిలో వుంది రాజేశ్వరి.)

"ఆగు. పాపం యిది. నామీది ఆశను వొదులుకో. రేపణ్నించీ రావొద్దు. నన్ను మర్చిపో. నేను నీకు అమ్మననుకో, అమ్మను. నిన్నుకన్న అమ్మననుకో. తల్లిమీద ఈకోర్కె రావటం పాపంకదూ? ఇది చెప్పేందుకే వచ్చాను."

"ఎట్లా అనుకోను? ఎంతప్రయత్నించినా ఆ భావం రావటల్లేదు. మొదట్లో ఎంత అలవాటు చేసుకోవాలనుకొన్నాను నువ్వు 'అమ్మ' వని? కానీ కావు నాకు."

చంద్రుడు కొండ వేపు జరుగుతున్నాడు. గన్నేరుగుబుర్ల నీడలు సాగుతున్నాయి. రెండుకొంగలు లేచి చెరువు వేపు వలయంచుట్టి తిరిగి చెట్టుమీద వాలాయి. ఏవోపిట్టలు దూరంగా అరుస్తున్నాయి.

"నేను.. నేనే నిన్ను పాడుచేస్తున్నాను. రేపణ్నించీ అసలు గుళ్ళోకి రాను" అన్నది రాజేశ్వరి.

"రావా? రావా? నేనుచస్తాను." అన్నాడు ఆమెభుజం మీద తలపెట్టి.

"ఏంచేసేది? అందుకే నువ్వంటే జాలి నాకు. నామూలంగా బాధ. పాపిష్టిదాన్ని. నిన్ను హింసపెడుతున్నాను. ఏం చేసేది? నాదేం తప్పు?"

(చాలు, 'నీమీద జాలినాకు' అన్నవాక్యం స్త్రీ నోటి నుండివొచ్చిందా? వేరే ప్రోత్సాహం అనవసరం పురుషుడికి. ఆ మాట అనటంతో తనమీది సర్వాధికారాలనూ ఆమె కోల్పోతుంది. 'నేను నీ దానిసని. నీకు లొంగిపోయాను. నీ పద

దళితమయిపోయాను. నన్ను నువ్వేమన్నా చేసుకో, నేను అభ్యంతరం చెప్పను. చెప్పే శక్తిపోయింది నాకు' అని అర్థం. ఆమాటకు గోపాలరావు చొక్కా గుండీలు విప్పి దూరంగా విసిరిపారేసి, చేతులుచాపి ఆమె వీపు వెనక వేళ్ళు కలిపి, తన వేపుకు తీసుకొన్నాడు. రాజేశ్వరి అన్నీ మరచిపోయింది. ఈ లోకం, కాలం, గోపాలరావు, సర్వం, సర్వం తెలీవు ఆమెకి. కళ్ళు మూతలుపడ్డాయి. రాజేశ్వరి జుట్టువూడింది. తులసీదళాలు కిందపడ్డాయి. ముక్కులోనుండి వెచ్చటిగాలి అతని ముఖాన్ని తాకుతున్నది. మెల్లగా, లేడిపిల్లవలె పెదిమలు కదిలిస్తున్నది. మాటలురావు. ఎన్నోయుగాలనుండి ఆమెలో, ఆమె జాతిలో పేరుకుపోయిన దయ, జాలి ఆమెని, ఆమె వ్యక్తిత్వాన్ని ధ్వంసంచేసినై. బాధ తనుచూసి బాధ భారత ఆధ్యాత్మిక హృదయం సహించలేని బాధ. పాపం ఏంచేస్తుంది రాజేశ్వరి!

(ఏ మహా తపోఫలితమో జన్మించిన రాజేశ్వరి శరీరం, వొంపుదగ్గిర తుళ్ళిపడే ప్రవాహములాంటి యవ్వనం, బుగ్గలు, ప్రకృతి ప్రసారించిన మృదుసదనపు లాలస అన్నీ. అన్నీ తాకి, నొక్కి అదిమి అనుభవిస్తున్నాడు. కోతులు, కుక్కలు, మృగాలు; పశువులు మొదలైన అతని రక్త సంబంధీకులంతా, అతన్ని ముందుకు ముందుకు తోసి, తమనుతాము ప్రతిఫలింప చేసుకొంటున్నారు ఆ సమయాన అతనిలో.)

ఆమెకుఆమె తెలీదు. అతనిచేతుల్లో పడి, శరాఘాతం తిన్నకురంగంవలె రాజేశ్వరి శరీరం మూలిగింది. మెలికలు తిరిగింది. పవిత్రభారతనారి మానం మహాపవిత్రమైన దేవాలయ ప్రాంగణంలో చెరపబడుతోంది. ఇంతకాలం ఆమె శూన్యాన్నే

నమ్మిందా? భగవంతుడున్నాడంటే యిదంతా గమనిస్తూ కూచున్నాడా? ఆమెలో రాక్షసత్వాన్ని రగిలిస్తే అతను నాశనమౌతాడే! లేక అతనిలోనుండి ఆ పాపపుకోర్కె తీసేస్తే పోతుందే! ముక్కోటిదేవతలు, భారతదేశ ఆధ్యాత్మిక శక్తులు, ఆమెచేసిన భక్తి, ఏవీ—ఏవొక్కటీ ఆమెని రక్షించలేదు.)

(అతని కావిల్లోకి వొచ్చేంతవరకే ఆమె. అతని స్పర్శతో, సర్వపూజలూ, శక్తులూ నీతులూ దూరంగా తొలగిపోయినాయి. అతని నడుంచుట్టూ చేతులుకట్టి, తన వేపు, తనలోకి, తన అంతరాంతరాల్లోకి, రక్తకణాల్లోకి తీసుకోంటోంది. అతని చెంపలు రొమ్ములకు అదుముకొంది. ఎక్కడున్నదో తెలీదు. కలలు. కాంతులకలలు. విశ్వంలో ఏపదార్థమూ, కార్యమూ, యివ్వలేని మహోన్నత ఆనందపు కలలు. అతని జుట్టు పీకింది. స్వాధీనంతప్పిన చేతులు, అతన్ని తనమీదకు అదుముకొంటున్నాయి ఆమెవి.)

గోపాలరావు విజయనినాదంచేశాడు. వస్తుతః ఆమెమీద కోర్కెవుంది అతనికి. కానీ అది విఫలం కావటం ఎంతసేపు? ఆమెలో దుర్బలత్వం లేకపోతే, శాస్త్రాలు, నీతులు, ఆచారాలు, సాంప్రదాయాలు ఆమెలో ఆదౌర్బల్యంలేకుండా చేస్తే, అతని గతేమిటి? అతనేగాదు పురుషప్రపంచపు గతే అర్థంకాదు స్త్రీలపట్ల.)

(రాజ్యాన్ని గెలిచిన వీరుడు విశ్రాంతి తీసుకొంటున్న పద్ధతిలో వున్నాడు గోపాలరావు. ఆమె అతన్ని వొదిలి కూచుంది. ముఖంలో, మనసులో ఎక్కడా మాలిన్యం, భీతి, పాపం, అసహ్యం feel గాదు రాజేశ్వరి. సంతృప్తిపడుతోంది.)

(ఆపని పాపం అనిపించటల్లేదు ఆమెకు. కారుణ్యం. తనకై, తనకోసం బాధపడే వ్యక్తిని, ఆ బాధనుండి రక్షించానన్న తృప్తి, ఆనందం. అనాదినుండీ వొస్తున్న సాంప్రదాయాలు, భూతదయ బోధలు అట్లాచేసినై రాజేశ్వరిని. పాపంగాదా, తనవల్ల మరొక ప్రాణికి హాని కలుగుతుంటే! చీమ కాలిక్రిందపడిచస్తే దానాలు చేసేవాళ్ళు, పులిని చంపటానికి వొప్పుకోని దయాపరులు, మహాహాంతకుల్ని క్షమించగల ధీరోదాత్తులూ, గడ్డిని కొయ్యటానికి గిలగిలలాడే ఆర్ద్రమనస్కులు ఆమె పూర్వీక భారతీయులు. వాళ్ళందరూ ఆమెలో తమ ధార్మిక సంపత్తిని దాచుకొన్నారు. నీటినుండి ప్రతి రక్తకణంలోనూ జీర్ణించిపోయిన, భావాలనుండి ఎట్లా విడివడగలదు రాజేశ్వరి?)

"వెడతాను" తన చుట్టూవున్న గోపాలరావును తప్పించుకొంటూ అన్నది.

"అప్పుడే! అప్పుడేనా వెళ్ళటం?"

"ఆయన..."

"ఎట్లా విడవను ఈ కంఠపుఒంపూ, భుజాల పల్చదనం ...భూమిని వెదుకుతూ వొచ్చే వుపాకన్యను, నిన్ను" అంటున్నాడు.

(ఆమెకు తను ఎంత యిబ్బందో తెలుసుకోడు. తన సంగతే తనకి. అతని వర్ణన ఆమెకు అసహ్యంగా, డోకుగా వుంది. వొట్టి అర్భకుడికిమల్లే అజ్ఞానికిమల్లే కనిపిస్తున్నాడు రాజేశ్వరికి. తుచ్ఛమైన శరీరాన్ని ఇట్లా, యిటువంటి అపురూపమైన మాటలతో వర్ణిస్తాడేమిటా అని ఆశ్చర్యం.)

"వొదులు, పోవాలి"

"తప్పదా? పోకుండా వుండలేవా? ఈ కాలం యిట్లాగే ఆగిపోతే! ఎప్పుడూ నువ్వూ నేను విడిపోకుండా, ఈ ఆకాశం నీడలకింద, చెట్ల పచ్చదనంమధ్య వుంటే?"

"ఏముంది వుంటే! ఇకపో. మళ్ళీ రాము రోజూ గుళ్ళోకి. నా వేపు అట్లా దిగులుగా చూడబోకు. నన్ను మర్చిపో. ఏం? సరేనా?"

"నిన్నా? నిన్నా మర్చిపోవటం? నన్ను నేను మరిస్తే- అప్పుడూ నిన్ను మరవటం. జీవితమంతా అద్భుతంగా వెలగ గల కాంతితో నింపావు నన్ను. ఎట్లా జరుగుతుంది నిన్ను మరవటం? రోజూ నిన్ను చూడందే నేను బ్రతకలేను..."

"నేను చచ్చిపొయ్యాననుకో. రాజేశ్వరి చచ్చిపోయింది వెళ్ళు. ఎవర్ని చూస్తావురోజూ? నేను చచ్చిపొయ్యానుగా." రాజేశ్వరి, దిగులుగావున్న అతనిముఖాన్ని మెల్లగావూయిస్తూ.

("నేను వినలేను. నాకు తెలుసు. నువ్వు చచ్చిపోవు. నీ దాపుకురావటానికి మృత్యువే భయపడుతుంది... ఏంచెయ్యను? నా చేతప్నా? నేను నాస్వాధీనంలో లేను. ఏదో అనూహ్యమైన మహాశక్తి నన్నిట్లా ప్రేరేపిస్తున్నది.")

(అబద్ధంగాదు. ఆ నిమషాని కవి నగ్నసత్యాలు, అబద్ధం అనిపించవు. అప్పుడు అంతే.

"అయితే నేను రేపణ్నించీ గుళ్ళోకిరాను."

"రావాలి. నాకోసం...వొట్టే!"

"ఒక్తే నన్నుగురించి నువ్వుపడేదిగులు చూస్తూ సహించ లేను. విచారంతో మెలికపడే నీపెదిమ, ముఖమునిూది

దుఃఖపు బలువు, స్వయంగాచూస్తూ ఎట్లావూరుకోను? నాకో సంగాదు. నీ రక్షణకోసం, మంచికోసం రాను."

("రాకపోతే మరీ కుంగిపోతాను. తోచదు. చీకటి. ఏమీ తెలియదు." అన్నాడు కన్నీళ్ళుపెట్టుకుంటూ.

ఆమె హృదయం ద్రవించింది.

"ఎట్లా నాన్నా నీతో చచ్చేది! ఒకసారితో తృప్తి పడవు...నువ్వంటే భయంగావుంది నాకు. ఏమౌతావో అని... పాపిష్టిదాన్ని, ఎందుకు పుట్టాను? ఎందుకు ఈ తుచ్ఛమైన తోలుతిత్తిని చూపి నిన్ను హింసిస్తున్నాను?" అన్నది రాజేశ్వరి, అతని కన్నీళ్ళు తుడుస్తో.)

(అతని పురుషత్వానికి అర్థమవుతోనే వుంది ఆమె బలహీనత ఒకసారి దయతో, శరీరంమీద సర్వహక్కులూ పురుషుడికిచ్చిన తరవాత, అతనినుండి తప్పించుకోవటం కష్టమైన పని ఏ స్త్రీకైనా. ఆకలితో చచ్చిపోతున్న పాముకు పాలు పోసి బతికిస్తే, అది కరవకుండా వూరుకోదు.)

("నువ్వు రోజూరా. లేకపోతే...నువ్వు రానిరోజున నేను ఆత్మహత్య చేసుకొంటాను. నేను జీవించటం నీకిష్టంలేని రోజున రావటం మానుకో. సరేనా?")

గోపాలరావుకు తెలుసు ఆమె రాకుండా వుండదని, భూతదయ, కారుణ్యం, అనంతకాలంనుండీ ఘోషపెడుతున్న బోధలు, పిపీలికంకోసం, చిలకకోసం, డేగకు మాంసంకోసం, శరీర భాగాలనూ, శరీరాలనే త్యాగంచేసిన త్యాగమూర్తుల రక్తం ఆమెలో వున్నంతకాలం; తనకోసం, అందంకోసం, తను అసహ్యించుకొనే మలమూత్రాదుల కొంపకు ఆశించి, లభ్యం

కాకపోతే ఆత్మహత్య చేసుకొంటాననేన్య క్కికి—ఆశరీరం యివ్వ కుండా వుండ లేదు. ప్రాణాలను, ధనాన్ని, రాజ్యాలను, తపోశక్తుల్ని, పరుల సౌఖ్యాలకు తృణప్రాయంగా వెచ్చించిన మహా మహుల జీవకణాలు, ఆమెను వొంచి, వొప్పుకొనేట్టుచేశాయి.

"వెడతాను" పోతోంది రావణుని చేతుల్లో మానభంగంపొందిన రంభకుమల్లే.

("రేపు—తప్పక ... లేదా ఎల్లుండి నాశవం చూస్తావు" అన్నాడు గోపాలరావు.)

ఆమె వెనక్కితిరిగి క్షణకాలం నిలబడి, గట్టిగా నిట్టూర్పువిడిచి పచ్చగన్నేరు పొదల్లోకి మాయమైంది.

అదృష్టవశాత్తూ లభించిన ఈ అందాన్ని గోపాలరావు ప్రతిరోజూ అనుభవిస్తున్నాడు. ఒకసారి ఆమె చాలాదిగులుగా కనపడ్డది. నవ్వదు. తనవేపు చూడదు. పలకదు. అతనికి తోచ లేదు. ఆమె అట్లావుంటే!

"ఏమిటి?" అన్నాడు గోపాలరావు ఆమె ముఖాన్ని పైకెత్తి.

"ఆఁ"

"ఏమిటి ఇట్లా దిగులు ...?"

"ఏం లేదు. నుస్తీ"

(తరవాత ఆమెను కావిలించుకొన్నప్పుడు, వీపు వుబ్బు లుబ్బులుగా తగిలింది. రెవికలాగి చూశాడు. నల్లగా రెండంగుళాల వెడల్పులో చర్మం కమిలిపోయింది. అట్లాంటి చారలే తొడలమీద, పిరుదులమీద గూడా చూశాడు.)

రాజేశ్వరి చప్పున కన్నీళ్ళతో అతని వొళ్ళో వడి పోయింది.

"ఎవడువాడు? ఏ రాక్షసుడు నిన్నిట్లాచేసింది? వాణ్ణి... వాణ్ని ... నరుకుతా. బూడిదచేస్తా. చాణక్యుడికిమల్లే ఆ భస్మ జలం తాగుతా" అన్నాడు గోపాలరావు — ఆమె చారలకు పుమ్మితడిరాస్తో. గోపాలరావు చదివిన చరిత్రలో చాణక్యుడే జ్ఞాపకం కొంచం. ఆ పాఠం వినియోగం యిక్కడ తటస్త పడ్డది.

"ఎవరూ లేరు. ఆయన్నేమీ అనకండి. ఏంచేస్తాడు పాపం ఆయనమట్టుకు?"

"ఎవడు ఆ..." అని బూతు పలికాడు.

"వొద్దు. వూరుకో."

"వూరుకోను. వాడి శవంమీద నిన్ను నడిపిస్తా. నేను మామూలుమనిషిని కాను. చెప్పు?..." ఆవేశంతో వూగు తున్నాడు.

("మీ భార్యకు మరొకడితో సంబంధం వున్నదంటే మీరు వూరుకొంటారా?")

గోపాలరావుకు తన భార్య మేనమామకు అన్నం పెడుతూ మాట్లాడినందుకు నెత్తురుపడేట్టు కొట్టిన విషయం జ్ఞాపకమొచ్చింది.

("నీభర్త? వాడేనా కొట్టింది?" అన్నాడు గోపాలరావు తగ్గుస్వరంతో. అట్లాకొట్టటం న్యాయమని అతని అంతరాత్మ నినదిస్తున్నా అది పైకి కనపడనియ్యకుండా, అన్యాయమనేట్టు ధ్వనింపచేస్తున్నాడు.)

"ఎంతకాలంనుండి వాడు నిన్ను కొట్టటం?"

"పోనివ్వండి" అన్నది రాజేశ్వరి ఆమాటలు అతనితో చెప్పటం యిష్టంలేక.

"కాదు. ఎంతకాలంనుండి?"

("మొదట్లో లేదు. అర్థరాత్రప్పుడు కనబడకపోతే యేమనుకొంటాడు? ఎంతకాలం నమ్మతాడు...?" రాజేశ్వరి ఏడుస్తోంది.)

("ఊరుకో" అన్నాడు గోపాలరావు. అతనికి దిక్కు తెలియటల్లేదు ఏమనటానికీ కూడా.)

("రావటం మానుదామనుకొంటాను. ఆ గట్టి నిశ్చయంతోనే పడుకొంటాను. కానీ నిద్రరాదు. చుట్టూ మునురుకొంటున్న దిగులు నిన్నుగురించి—ఒక్కపూట రాకపోతే, నువ్వేమనుకొంటావో, ఎంత బాధపడతావో, ఈ గడ్డిలో, గుడిలో, ఎట్లా పిచ్చిగా, నాకోసం ఎదురుచూస్తోవుంటావో అని దిగులు. ఏంచేసేది? ఆయన నన్ను అర్థంచేసుకోడు.")

("వాడు మనిషిగాడు, నిన్నింతగా దుఃఖపెడుతున్న ఆ కీటకం" అన్నాడు కసిగా గోపాలరావు. ఆ సమయాన తను భార్యను చీల్చుకుతింటున్న సంగతి గుర్తుకురాదు అతనికి)

("కొట్టినా యాడవను నేను నన్ను నీచం చేశాడు. నాకు మదం, కొవ్వు, కావరమట నీతో రావటానికి. "నేను చాలక, వాడు అవసరమయ్యాడా?" అన్నాడు. ఎంత చెప్పినా వినిపించుకోడు. నావన్నీ అబద్ధాలంటాడు. నాకా మదం? కావరం? కొవ్వు? నేను వొక్కరవ్వ ఆలస్యమైతే నువ్వు ఎంత వేదన పడతావో వారికి తెలీదు. కన్నీళ్ళతో నా నడుము చుట్టూ

వేళ్ళాడే నీరూపాలు అర్థంకావు...ఇప్పటికి లేస్తాడు. నన్ను ఈరాత్రి ఏంచేస్తాడో చెప్పలేను...వెడతాను" అంటో రాజే శ్వరి లేచింది అతన్ని తప్పుకొని.

"పో. వెళ్ళు. వెళ్ళు," అన్నాడు గోపాలం చేతులు ముఖానికి కప్పుకొని.)

రాజేశ్వరి ఆగి వెనక్కువొచ్చి అతన్ని వొళ్ళోకి తీసుకొంది.

పసిపిల్లవాడికిమల్లే ఆమెవొళ్ళో వాలాడు గోపాలరావు. ఆమె అతని వీపును, జుట్టును సవరిస్తోంది.

జగద్గానస్వనాలకు పులకలెత్తి, లలిత లాస్యంచేస్తున్నాయి నక్షత్రాలు. తెల్లగా కరిగిపోతున్న ఆకాశంమీద అలలమల్లే మబ్బులు ప్రవహిస్తున్నాయి. గాలిలో—కప్పల, కీచురాళ్ళ, కంఠారవాలు. చుట్టూ మంచులో స్నానం చేసిన నిర్మలమైన గడ్డి. జిల్లేడుపూలు చందుర్ణి పందెం కడుతున్నాయి తెలుపుకు. వాళ్ళిద్దరూ దుఃఖపు బరువుతో వొంగిపోయినారు.

("మరిచిపో. నేను చచ్చిపొయ్యాననుకో. రాజేశ్వరి చచ్చింది. ఇంకేంవొస్తుంది నీదగ్గిరికి?...పూరుకోనాన్నా! వారికి అర్థంగాదు. మళ్ళీ తెలీనిమొద్దుగాదు ఆయన. 'ఆకలి' అంటూ ఎవడన్నా వాకిట్లోకివస్తే అన్నంపెట్టి, డబ్బులిచ్చి ఎవరికి ఏ కష్టమొచ్చినా, తనకొచ్చినట్టు విచారిస్తాడు. కాల్లో ముల్లు గుచ్చుకుంటే, తేలుకుడితే, తలనొచ్చితే, అట్లా కళ్ళ నీళ్ళు పెట్టుకొని హైరానా పడతాడు — శత్రువులకొచ్చినా మళ్ళీ. కానీ నాకోసం వొక మానవ హృదయమే క్షోభిల్లిపోతున్న

దంటే నమ్మడు, బలిసిన కామం కొవ్వు, కండరాల మదం ఇదంతా నంటాడు. అన్ని కష్టాలూ నిజమయి—ఇదొక్కటే ఆయన మనసులో అబద్ధమయింది. ఆయన విలపించే కష్టాలు తీరిస్తే పుణ్యలోకాలు వొస్తాయిట ఇది—నన్ను గురించి నువ్వు పడుతున్న ఈ వేదన తీరిస్తే పాపం నరకమట. ఇన్ని శాస్త్రాలు చదివారాయన. ఇదెట్లా సత్యమని నమ్మాలో తెలీకుండావుంది. వూరుకో. వొస్తాగా..." అంటున్నది అతన్ని రాజేశ్వరిలాలిస్తో. ఆమెనుండి ఆవాగ్దానం పొందినతరువాత గోపాలరావు స్థిమిత పడ్డాడు.

(భారతీయతత్వమంతా పాడయిపోతున్నదని వేదాంతులూ, భక్తులూ గోలపెడతారు గానీ, అతిథులకు భార్యను దానంచేసిన పురాతనత్వాన్ని తిరిగి ప్రతిష్టించ రేం?)

తమ రుషులు, పూర్వీకులు చెప్పిన మాటలేగా యివి. అన్నిట్లోనూ, 'దయ' వుండొచ్చు. అన్నిటికంటే మహోన్నతమైన జన్మకు సాఫల్యాన్ని, సార్థకతను యిచ్చే, ఈ మాధుర్య కార్యానికి 'దయ' పనికిరాదు మిగతావన్నీ పుణ్యం. ఇదొక్కటే పాపం...

రాజేశ్వరి వెళ్ళింది...

(వాన. అంకుశపుపోట్లుదిన్న మదమత్తేభాలవలె మేఘాలు ఘోష పెడుతున్నాయి. గోపాలరావు కిటికిలోనుండి బైటికి చూశాడు. అంతా వర్షంలో తడిసిన చీకటి. హోరుగాలి విసురు. నిన్నరాత్రి తను ఆవేళప్పుడు రాజేశ్వరితో గడిపిన సంగతులు జ్ఞప్తికి తెచ్చుకొంటున్నాడు. వాన. ఆకాశంమీద అగ్నిదేవుని వీరవిహారం. మెరుపుల్లో లోకమంతా మండుతోంది...హాయిగా

ఈపాటికి రాజేశ్వరితో...ఛీ...వాన. అంతే అనుకోంటాడు. పోడు. ఆమె తనకొరకు ఎటువంటి త్యాగం చేసింది! తను తన కోసం వానలో గుళ్ళోకిపోలేడు.

(ఎక్కడో ఎవ్వరోదవ్వ, స్త్రీ ప్రేమకోసం, ఆమె పెది మలమీద లలితంగా మెరిసే వెన్నెల చిరునవ్వుకోసం, జీవిత మంతా మహోన్నతంగా, గర్వంగా జీవించగల ఆమె ఆలింగ నంలోని లాలిమకోసం త్యాగంచెయ్యలేరు. అల్పాతిఅల్పమైన వాటినిగూడా. )

గాలి తలుపును కొడుతోంది. మనిషికిమల్లే పిలుస్తోంది. గోపాలరావు తలుపుతీశాడు. రాజేశ్వరి నవ్వుతో వొచ్చింది లోపలికి. వర్షంలో తడిసిన ఆమె వొంటికి చీరె అంటుకుపోయి, దీపంవెలుతురులో మెరుస్తోంది. జుట్టు చివర్లనుండి నీళ్ళు కారు తున్నయ్. చలికి గడగడ వొణుకుతోంది.

"రాలేదేం?" అన్నది రాజేశ్వరి జుట్టు నీళ్ళుపిండుతూ. గోపాలరావు సిగ్గుపడ్డాడు. స్త్రీకున్న సాహసమైనా లేని దౌర్భాగ్య పురుషుడు.)

అతని ధోవతి కట్టుకొంది. రెవికలేదు. ఆకాశపు నిర్మల జలాలతో క్షాళితమయిన ఆమె శరీరపు శుభ్రతేజస్సు, ఆగదిని వెలిగించింది.

("చాలాసేపు చూశాను. పెద్దగా పిలిచాను. వెదికాను. ఏంవాన! ఎన్నిగుంటల్లో పడ్డాను! ఈ రాత్రి వొస్తాననుకోలేదు నీదగ్గిరికి. నేను రాననుకున్నావుగదూ?" అన్నది రాజేశ్వరి అతని భుజాలుపట్టుకొని. దూరంగాపుంచి, మొఖంలోకిచూస్తూ.

"లేదు" అన్నాడు గోపాలరావు.

(“నాకు తెలుసు; నువ్వనుకొంటావు నేను లేనిది నువ్వే వుండవని.” ఇట్లా అయితే ఎట్లాజీవిస్తావోయ్ ముందుముందు?” అని కావిలించుకొని ముద్దుపెట్టుకున్నది.)

వలచని ధోవతికింది వొంటిరంగు. మెడమీది నవనవ, ప్రకృతి శ్రద్ధతో, భక్తితో, ఆపేక్షతో తీర్చిదిద్దిన స్నిగ్ధోన్నతాల మెరుగు, యూరువుల అందాల బరువు, అన్నీ ఆరాత్రి అతని స్వంతం—గళ్ళపరుపుమీద.

తెల్లారికట్ట తెలుపులో కరిగిపోతున్న చక్కని చివరి కాంతిలో, వర్షంలో శుభ్రపడిన లోక పర్యాలోకన కోసం బయలుదేరే ఉషాకన్యవలె రాజేశ్వరి వెళ్ళిపోయింది.

“నువ్వు గుళ్ళోకి రావొద్దు యికనుండి. ఎందుకైనా మంచిది. యిల్లు కదలకు. నేనే మీయింటికొస్తుంటాను. తప్పక, తప్పకవొస్తాను. నువ్వుమాత్రం రావొద్దు” అన్నది రాజేశ్వరి పోతూపోతూ.

గోపాలరావుకు ఆశ్రమగూడా లేదు. ప్రతిరోజూ రాజేశ్వరి రాత్రి పదిదాటివొచ్చి తెల్లవారుఝామున వెడుతుంటుంది ఒకరోజున గోపాలరావు ఆమె వీపు, తొడలు, పిరుదులు పరీక్షిస్తున్నాడు.

“ఏమిటది?” అన్నది రాజేశ్వరి.

“అవె!” అన్నాడు నవ్వుతో ఇంకా చేతులతో వాటిని తడువుతోనే.

“దెబ్బలా? అవునా?... ఇంకెందుకుంటయ్?” అన్నది నవ్వి.

"ఏం? వోశికచచ్చిందిగావును? విను గె_త్తిపూరుకొన్నాడు"

"వుండవు. వుండటానికి వీల్లేదు!!" అన్నది.

పదిరోజుల తరవాత గోపాలరావు బజార్లో వాకతన్ని పోలీసులు సంకెళ్ళతో తీసుకెడుతుంటే చూశాడు. ఆ ఖైదీని తెలిసినాయన, తనవిచారాన్ని మాటల్లో తెలియచేసి, లోకంలో స్త్రీల సాహసాల్ని, అన్యాయాల్ని, పూర్వపు స్త్రీలల్లో వుండే పాతివ్రత్యాన్ని (?) గురించి మాట్లాడుతున్నాడు తన అనుభవంలోనించి.

"ఏమిటి?" అన్నారు వాకరు.

"అతను భార్యను చంపాడు."

"ఎందుకు?"

"ఎప్పుడు."

"అతని భార్య 'రంకుతనం' చేస్తుంది. చాలాకాలం చెప్పి, కొట్టిచూశాడు పాపం! భార్యను దోవలో పెడదామని ఆ పెద్దమనిషి. ఆమెవినలేదు. పదిరోజుల కిందట—అంతవర్షంలో కూడా. ఆమెగుళ్లోకి వెళ్ళిందట విటునికోసం. సహించలేక మొగుడు వెళ్ళికత్తితోపొడిచిచంపాడు. పోలీసులుపట్టుకొన్నారు"

గోపాలరావుకళ్ళముందు బజారు, అందులో నడిచే బళ్ళు, పరిజలు, ప్రక్క దుకాణాలు గిరగిరా పరిభ్రమిస్తున్నాయి. తలక్రిందులౌతున్నాయి. ఆ మహావేగంలో ప్రపంచమంతా చీకటయింది. భూమి అగాధమై అతన్ని లోపలికి జారుచ్చుకొంటోంది.

(ఎవరు? రాజేశ్వరి... రాజేశ్వరి ... పదిరోజుల క్రిందట ... కత్తితో చావు ... రోజూ ... ప్రతిరోజూ ... తనతో ... రాత్రిపూట ... ఎవరు? ఎవరు? ఎవరు? ...???)

# మమకారం

భర్త బూట్ల చప్పుడు, క్రమక్రమంగా క్షీణించిపోతూ, నిశ్శబ్దమయింది. తొందరతొందరగా కొట్టుకొనే గుండెచప్పుడు తప్ప ఇంకేమీ వినిపించటంలేదు, సరోజినికి పగలే అయినప్పటికీ పెదిమలు వొణుకుతున్నాయి, లోపలి భయాన్ని, ఎందుకో తెలీని ఉద్వేగతను ఆపుకోనేందుకుచేసే ప్రయత్నంలో ఒక్క నారి, చప్పున వీధిలోకెళ్ళి, కుటుంబరావును పిలుద్దామనుకుంది, ఆఫీసుమాని తనతో ఉండమనేందుకు. కానీ... వృధా, లేవ లేదు ఓపికలేదు. ఎవరో తనకు తెలీనివాళ్ళు, ఏవో తనకు తెలీని శక్తులు, ఆమె ఉద్దేశ్యాన్ని వొంచి, అణచి, బలాన్ని ఆపి, కదల నివ్వటల్లేదు సరోజినిని.

ఇంత కితం వరకూ సరోజిని లోపల అనుకొంటూనే ఉంది, ఈయన-అదే-ఈ మనిషి కుటుంబరావు, ఎప్పుడు ఆఫీసుకుపోతాడా, ఇంకా తొందరగా పోడేమిటాఅని. పాపం! ఏ దేవతలకో కోపమొచ్చి, కాలాన్ని ఆపి, క్షణాలను దీర్ఘించేశారు గావును! కాదా? రోజూ పెందరాడే వచ్చే గన్నేరుపాదు నీడ యింకా గడపదగ్గిరికి రాదేం? నిజం! ఇట్లాగే అనుకున్నదా సరోజిని? ఇప్పుడు పోయినందుకు విచారిస్తోంది. తప్పనిసరిగా పోవలసిన అతని డ్యూటీమీద కోపం ఆమెకు.

ఎన్నో అనుకుంది. ఎట్లా ఎట్లా సమీపించాలి? తొలిగా ఎట్లా మాట్లాడాలి? ఒకవేళ అతను ముందుగా పలకడు. అప్పుడు? పలికితే? తను అనుకున్నట్లే మాట్లాడతాడా సీను?

కాదా? మరోవిధం అయితే? ఏమిటి? ఏమిచెయ్యాలి అప్పుడు తను? తెలీదు. వీటికి మాటిమాటికి తనను ముసురుకొని చికాకు పరిచి, మనస్సునే ఛిద్రంచేస్తున్న వీటికి—దొరకదు సమాధానం ఆమెకు.

బహిరంగంగా ఆమె స్తబ్ధ. కానీ లోపల గట్టిగాజరుగుతూనే ఉంది అలజడి. ఒక్కొక్కసారి నిజంగా బాధపడుతుంది. కుటుంబరావును తలచుకొని, అతనికి ద్రోహం చేస్తున్నానేమోనని. అయితే సీనుమీద కోరికకలగటమే తప్పయితే, ఆకోరికే అసలు తనకు రాకుండాఉండాలిగదా! ఇంతగాఢంగా, బిగ్గరగా సీనువేపువంగే తనవాంఛ తప్పో, ఇంతగొప్ప ఆవేశాన్ని చంపుకొని; పాపానికి, వీటికి మృగాలవంటి మనుష్యులకు జడిసి వ్యక్తిత్వాన్నే, ఆత్మనే వక్రించుకొని లోపల ఏ కల్మషమూ లేనట్లు అంతా నిర్మలమూ స్వచ్ఛమూ అయినట్లు దొంగ బ్రతుకు బ్రతకటమే తప్పో నిర్ణయించుకోవటం, నిర్ణయానుసారం ఆచరించడమూ, ఎంతకష్టం!

ఆమెకు ముందుగా తెలీదు సీను విషయం. ఏకొంచెం తెలిసినా అతన్ని యింటికి తేవొద్దని భర్తతో చెప్పగలిగేది సరోజిని. చిన్నప్పటి స్నేహితుడు; గొప్పఉద్యోగం. వచ్చాడు. తనిక్కడఉండగానే సీనును ఎట్లా హోటల్లో ఉండమంటాడు కుటుంబరావు. అందులో అతనికి భార్యమీద నమ్మకముంది ఏ శంకరమో అయినట్లయితే స్నేహితుడేమిటి, తండ్రినే, తమ్ముణ్నే, అమ్మనే నమ్మేవాడుగాదు. భార్యశీలాన్ని వీళ్ళంతా ఆదరిస్తారనీ, లేదా యింకో కళకు దాచిపెడతారనీ భయం వలన భార్య కాపరానికి రాగానే, చేస్తున్న పనినే వొదిలి ఆ

దౌర్భాగ్యురాలికి కాపలి కూచునేవాడు చుట్టకాలుస్తూ, గుడి పక్క వేపచెట్టుకింద మంచం వేసుకుని. పురుషవరేణ్యా! ధీరో దాత్తా! ఎంత ప్రబల విశ్వాసమోయి నీభార్యమీద నీకు! నాయనా! నీలోని ఏమానసిక శారీరక, దౌర్బల్యాలు పెరిగి నిన్నిట్లు అపనమ్మకస్తుణ్ని చేసినాయోకదా! నిన్నువొదిలి మరొకడికి నీభార్య లొంగిపోతుందనే మహత్తరభావం నీలో కలగడానికి నీదౌర్బల్యమే కారణమంటే శంకరానికి యెంతకోపం వస్తుందనీ! అనుమానమున్నవాళ్ళు, ఆ అద్దాల సోడాకొట్టు దగ్గరో, సింగుగారి పళ్ళదుకాణందగ్గరో పావుగంట కూచుంటే చాలు తెలుస్తుంది.

మానవ జీవితమే అనుమానాలతో నిండిపోయింది. అదే గొప్ప నాగరికతాలక్షణం. ఏవ్యక్తినైనా చూడండి. అతనికో అనుమానం వుండితీరుతుంది, కనీసం నేను బ్రతికుండగా వంద రూపాయల జీతగాణ్నవుతానా? పదివేలు బ్యాంకులో వేస్తానా? యిండియాకు కమ్యూనిజం వొస్తుందా? ఆవు కోడెను ఈనుతుందా? 'పాప' మరొకసారి ఆ గట్టిపమిట వెనక ఉన్న తాలను ప్రసాదిస్తుందా? ఏదానిమ్మచెట్టుపక్కనో, వడ్లబస్తాల వెనుకనో, చీకట్లోనో, పగటినో, ఇటువంటి అవమానాలే లేక, 'వొస్తుంది'—'జరుగుతుంది' అనే గట్టినమ్మకంతో కృషిచేసే వాళ్ళు, మూఢులూ, పిచ్చివాళ్ళు అవుతున్నారు. కుటుంబరావు అట్లా భార్యను వొదిలి వొంటరిగా పోతున్నప్పుడు, ఎందరు హితకాంక్షులు, శ్రేయోభిలాషులు అతన్ని అట్లా పోవద్దని చెప్పలేదు!

గత మూడురోజులనుండీ సరోజిని జీవనశకటం తోవ తప్పింది. ఎంత ప్రయత్నించీ, సీనుబొమ్మను తన మనోఫలకం నుండి చెరిపివెయ్యలేకపోయింది. ఆ ప్రయత్నంలోతుగాచేస్తున్న కొద్దీ, అతను మరింత సన్నిహితంగా, గట్టిగా, దగ్గిరిగా అవుతున్నాడు తనకు. ఎట్లాతోసేసుకుంటుంది సరోజిని, తనకు తెలీకుండా, తనప్రమేయం లేకుండానే, తనహృదయాన్ని లాలిత్యాలతో, లావణ్యాలతో నింపించి బాధించే అతనిమీద కోరికను—పనివుండక పోయినా అతను పడుకున్న గదివేపు పోతుంది. మెల్లగా ఏవీలులోనించో చూస్తుంది. అతను నిద్రపోతుంటే దగ్గరగా వొంగి, అతన్ని తనలో ఇంద్రచాపపు సాంద్రవర్ణ ధూమాలను రేపే సీనును—అట్లా చూస్తోవుంటుంది. అతనికి తెలీకుండానే మెల్లగా అతనిజుట్టును, దుస్తుల్ని తాకుతుంది. ఆమె ప్రబల హృదయావేదనను అర్థంచేసుకోగల వాళ్ళెంతమంది, ఎవరో 'అనూ' వంటివారు తప్ప.

రకరకాల కలలు. తలుచుకొంటేనే సర్వాంగాలు. అవును సర్వాంగాలూ, కర్వులు ప్రవహించే సుందర స్వప్నాలు. ఎంత హాయి!!

... చప్పునలేచింది, ఆమె ప్రయత్నం లేకుండానే. ఎవరో ఆమెను తీసుకెళుతున్నారు, లేతగులాబిరంగులలోంచి ముదురు పసుపులోకి, నీలపు మెరుగులోకి. ఎక్కడున్నామో తెలీనిలోకం. సరోజిని శరీరం అనంతభారంతో మూర్ఛలు పోయింది. పచ్చటివళ్ళు, గట్టి గుండ్రని భుజాల వుబ్బులు నవ్వుతోంది. అట్లా నవ్వుతున్నట్లు తనకు తెలుస్తోనేవుంది సరోజినికి. ఎవరో గంధర్వుడు, ఆమెపక్కనే పడుకున్నాడు. చేతులు వీపు అడు

గుగా పోనిచ్చి, గట్టిగా తనగుండెలకు అదుముకున్నాడు, గట్టి వైన ఆమె రొమ్ములను. మెల్లిగా ప్రయత్నం మీద - కళ్ళు కొద్దిగావిప్పింది. సీను, తనసీను, పెదిమకు పెదిమ, రొమ్ముకు రొమ్ము, బరువుగా ఆమె జుట్టు అతనిభుజాలు కప్పింది, కామి నియాావాసనలతో సహా.

"సరూ!!"

"మాట్లాడకు."

మాటలే లేవు మాట్లాడటానికి. విషయాలు లేవు. అతను చప్పున ఆమెపైటలాగి...బస్. మెడవెనక వేళ్ళు వేడి. హృదయంలోంచి హృదయంలోకి దూకి నిప్పుచినుకులు. కాలే పెదిమలతో ఆమె రెవికను వెదికాడు. ఆమె రెండు తెల్లని చేతులు అతన్ని బంధించి తనమీాదికి జార్చుకొంటున్నాయి.

"సరూ"

యెవరో ఆమెను గట్టిగా అద్దుకొని, కుదిపి లేపుతున్నారు. సహజమైన, మామూలైన కావిలి అది. మూడుసంవత్సరాల నుండీ అలవాటయిన కావిలి అది.

"ఏమిటి సరూ?"

అన్నాడు కుటుంబరావు అప్పుడే కళ్ళు తెరచిన ఆమె మీాదకు వొరిగి, బరువంతా ఆమెమీద అన్చి.

"ఏమిటి"

అని గొణిగింది సరోజిని. తనస్వప్నం భంగమయింది. మామూలు చారలపరుపు, కుటుంబరావూ మిగిలారు.

"అట్లావున్నావేం? కలవరించావేం?"

"ఏం లేదు"

అన్నది అతన్ని భుజాలు పట్టుకొని కొద్దిగా పైకియెత్తి.

"లేదా? నిజం! కలవరించావు అస్పష్టంగా. చప్పున నన్ను దగ్గరగా తీసుకొని రొమ్మును అందించావు, అందమైన నీ గొప్ప..."

సరోజిని కళ్ళల్లో నీళ్ళు, తెల్లని చెక్కిళ్ళమీదుగా దిండులో ఇంకిపోతున్నాయి.

"ఏమిటి సరూ"

అన్నాడు కుటుంబరావు. సరోజిని వులిక్కిపడి, చప్పున లేచికూచుని, అతన్ని వొళ్ళోకి తీసుకొని, అతనిమీదికి వొంగి ఏడుస్తోంది.

"ఏమిటి?"

అంటోనే వున్నాడు కుటుంబరావు.

"వొద్దు నన్ను తాకవొద్దు. పాపం చేశాను...ఛీ... పాపం...ద్రోహం..."

ఇవితప్ప ఆమె పెదిమలు ఇంకొకటి పలకవు. ఎంత అడిగినా చెప్పదు. ఆమె వొళ్ళు వెచ్చగా కాలిపోతున్నది. జుట్టు రేగి ముఖంనిండా భుజాల, రొమ్ములనిండా కప్పింది. రవికలేని ఆమె అందాలు దీపపుకాంతికే మెరుగులు. ఆ రాత్రి ఇద్దరూ వేరు వేరుగా పడుకున్నారు.

ఏదో క్యాంపుగావును...ఉదయమే వెడతాడు సీను. మధ్యాహ్నమో సాయంత్రమో వొస్తాడు. ఒకప్పుడు అతనూ శృంగార జీవే. ఉద్యోగం, డబ్బు, అధికారం, అంకెలు, అతనిలోని శృంగార భావాన్ని కుళ్ళగించి, శిలనిచేశాయి. ఆ ప వాళ్ళు, కావిలింతలు, ముద్దులు, యూరువులనున్నని స్పర్శలు,

కాళ్ళ మెళికలు, అతని జీవితంలోనించి తొలగించబడ్డాయి – ఒక్క–భార్య విషయంలో తప్ప.

ఒకరోజు... చాలారాత్రి. గదిలో దీపం గుడ్డిగా వెలుగుతోంది. సీను గాఢంగా నిద్రపోతున్నాడు. ఏదో అలికిడి, ఏదో వెచ్చటిస్పర్శ. బరువైన సువాసనల జుట్టు అతని ముఖం మీదికి జారివుంది. చరాలున లేచాడు. సరోజిని! కాళ్ళలో బలంలేక తూలుతోంది. ఒరిగి పడబోతూంది. చప్పున రెండు చేతులతోనూ ఆమెనడుమును పట్టుకొని నిలబెట్టాడు. మెల్లిగా మూలిగి ఆమెశరీరం అతనిమీదికి వాలింది. చేతులు వీపు వెనక కలుసుకొని బిగుసుకొంటున్నాయి. స్పృహలేని, నున్నని తెల్లని ఆమె చేతులు. వేలమంది యువకులు, కావాలని కలలు కనే ఆమె లావణ్య శరీరం, అర్ధరాత్రి లభించిన ఆ యువకుడు ఎంత అదృష్టవంతుడో గదా!

"ఏమండీ!"

సరోజినిని కుదిపి అడిగాడు సీను, ఆమెకళ్ళు తెరిచింది. ఎదురుగా సీను. అతనిలో కుటుంబరావు విసురుగా వొక్క–తోపుతోసి, గబుక్కున పక్క–కుతిరిగింది. రెండడుగులు నడిచి, కూలబడి, ముఖాన్ని చేతులతో కప్పుకొని ఏడుస్తున్నది.

సీను కేమీ తోచక, స్నేహితుణ్ని పిలిచాడు. సరోజినిని చూసేసరికి, కుటుంబరావుకు ఆశ్చర్యం వేసింది. తను కూచుని, భుజాల్కింద చేతులువేసి లేవదీశాడు.

"ఏమిటి సరూ"

ఏం చెబుతుంది? యెట్లా చెప్పగలుగుతుంది? తనను కాల్చి, మండించే ఆ వాంఛను, అందులో భర్తతో. మెల్లిగా

తలెత్తి సీనును చూసింది. వెంటనే కుటుంబరావును చూసింది. చప్పున భర్తవేపు వొంగి, అతని గుండెకు తలఆనించి ఏడుస్తున్నది.

"జ్వరం! అందుకేనా యీడవటం! తగ్గిపోతుంది. లోపలకు వెళదాం రా!"

ఆమెను అట్లా కావిలించుకునే లోపలకు తీసుకొచ్చి మంచంమీద పడుకోబెట్టాడు. మాట్లాడదు, కదలదు, నిద్రపోతుంది. మధ్య మధ్య ఉలిక్కిపడుతుంది. నిద్రలోనే చేతులు చాపి యెవరినో దగ్గిరికి తీసుకుంటుంది. కళ్లు తెరిచిందా? యెటో చూస్తుంది. ఈలోకానికి, పరిస్థితులకు సంబంధం లేని చూపులు చుట్టూ యెవరున్నారో యేం చేస్తున్నారో కూడా అవసరం లేని చూపులు. తనలో తనే గొణుగుతుంది. పెదిమలు కదిలిస్తుంది. ఏం తెలుస్తుంది, యెవరికైనా ఆమె సంగతి; తను స్వయంగా చెబితే తప్ప...

ఆ రోజు సాయంత్రం కుటుంబరావు పెందలాడే వచ్చాడు. తలుపులు దగ్గిరిగా వేసిఉన్నాయి. ఏమయింది సరోజిని ఆవేళప్పుడు? గబగబా ఇల్లువెతికాడు. సీను గదిలో అతని బెడ్ మీద పడుకొని ఉంది. తెల్లనిపక్కనిండా, నల్లని గటి జుట్టు అల్లుకొని; ఆ సాయంత్రం చీకటిలోనే, మెరుస్తున్న ముఖం.

"సరోజినీ!"

పలకలేదు ఆమె. కుటుంబరావు తనూ మంచంమీద కూచుని ఆమెను లేవదీశాడు. చొక్కాతో చెమటతుడిచాడు. చీర తిరిగికట్టి, ఆమెను భుజంమీద వేసుకొని వరండాలో

తెచ్చాడు. ఎంత శ్రమపడ్డ తర్వాతనో గానీ, ఆమెకు తెలివి రాలేదు. మెల్లిగా కళ్లు తెరిచి కుటుంబరావును చూసింది తడి కళ్ళతో. వెంటనే అతని గుండెమీదకు వాలి, మెడను కావలించుకొని వీపువెనక వెక్కిపడుతున్నది.

"ఎందుకు సరూ? ఏమిటి అసలు విషయం!"

అన్నాడు కుటుంబరావు ఆమెముఖాన్ని ముందుకులాగి చెక్కిళ్ళను పెదిమలతో తాకుతూ. ఉప్పగా కన్నీళ్లు తగిలాయి అతనికి.

"ఏం లేదు,"

దృఢత్వాన్ని తెచ్చుకోవాలని ప్రయత్నం గొంతులో.

"అబద్ధం—కదూ!"

మెల్లగా గడ్డాన్ని ఊపుతూ ఆమెకళ్ళల్లోకి చూచి అన్నాడు.

ఎట్లా కాదనగలుగుతుంది? నిజమే మరి! లాభంలేదు. తను కుటుంబరావుతో అబద్ధం చెప్పలేదు; తనను నమ్మి, తనే సర్వస్వమూ అనుకునే కుటుంబరావుతో.

"అవును."

తల వంచుకుంది సరోజిని.

"ఎందుకో చెప్పు ఈ బాధ! ఏం కావాలి? ఎవరేమన్నారు నిన్ను?"

"ఎవరూ లేరు" అని లేచిపోయింది.

కుటుంబరావు ఆమె వెనకనేవెళ్ళి, అడ్డంనిలుచుని, ఆమె భుజాలు పట్టుకుని దగ్గిరిగా తీసుకున్నాడు. అతని చేతులు అప్రయత్నంగా ఆమెనడుము దగ్గరికి పాకాయి. ముఖం, సరోజిని

ముఖానికి ఆనించి "నిజంచెప్పు సరోజినీ! ఎందుకు ఈ అస్వస్థత నీకు? ఏంకావాలి?" అంటున్నాడు.

"ఏం వద్దు."

పోబోయింది.

అతని కళ్లుకరిగి కారుస్తున్నాయి.

"ఏం ద్రోహం చేశాను సరూ నీకు? ఇంత నిశ్శబ్దంగా హింసిస్తున్నావు నన్ను..."

ఇంకా ఏదో అనబోయాడు గాని గొంతురాదు కుటుంబరావుకు.

సరోజిని తిరిగివచ్చి అతన్ని ఆనుకుని నిలుచుంది, సూటిగా ముఖంలోకి చూస్తూ.

"నిజం చెప్పు ఎందుకు?"

అంటున్నాడు బ్రతిమిలాడుకొంటున్నట్లు. అతనిలోకి చూస్తోంది. చెప్పబోయి ఆగుతుంది. పెదిమ కొరుక్కుంటుంది.

"నేను..." అని ఆగిపోయింది.

"ఆఁ...ఏమిటి?"

అతని కంఠంలో ప్రోత్సాహం, బుజ్జగింపు, ఏమయినా వప్పుకోగల శీవి.

"వద్దు, వద్దు, నన్ను విడవండి, నేను పాపిని..." అని బిగ్గరగా ఏడిచింది.

అతను మరీ క్రుంగిపోయినాడు ఎందుకు భయపడుతోంది సరోజిని? తనేంచేస్తాడు చెబితే? తననేనమ్మదా? అనే ఆలోచనలు కుటుంబరావుకు.

"నిజం. నీకోసం...నే నేమయినా అవుతాను సరూ! నావద్ద దాచకు. నా నెత్తురుతో ని న్నభిషేకించేస్తాను... ఏం కావాలి?"

అబద్ధంగాదు. ఆ మాటలు నిజమే! సరోజినికోసం అతనేమయినా అవుతాడు. మూడుసంవత్సరాల క్రిందట అయినాడు గూడాను.

ఒకనాడు అతను రోడ్లంట వస్తున్నాడు. గాలిఆడక ఉక్కిరిబిక్కిరయినాడు. యెవరో లాగుతున్నట్లు నడకసాగదు. ఆగిచూశాడు. చుట్టూ, పడిపోబోతున్న పెంకుటింటి వసారా లోనుంచి యెవరో తనను లాగుతున్నారు కంటికి కనిపించని బంధనాలతో. కాసేపటికిగాని ఆ కాంతిపుంజంనుండి ఓ అమ్మాయి రూపం అతను చూడలేకపోయినాడు. ఆమె చూపులే, నడకలే, పెదిమవంకరే ప్రత్యేకం. ఈ ముంజ ముఖాల లలనామణులనుండి, ఏ కపటమూ, మోసమూ, కల్మషమూ యెరగని ఆమె హృదయం పారిశుద్ధత, పెదిమలపై వెలిగేనవ్వులో కనిపిస్తుంది పురుషుణ్ని కుదిపి వెర్రులెత్తించి, కుంగగొట్టే రొమ్ముల కాంతులు, వెన్నెలలు పేరుకొని ఘనీభవించిన సుందర కాంతులు ఆమె చెక్కిళ్ళవి. కలలలోకి వెళ్ళాడు.

"కారు కారు కారు"

ఎవరో పెద్దగా కేకవేశారు. చట్టున ముందుకు తప్పుకున్నాడు. తలెత్తి చూసేసరికి ఆమెలేని జీబురు వసారా ఎదురుగా. రోజూ ప్రదక్షిణాలు, తపస్సులు, కలలు, ఆమె తాకిన కాయితం కోసం, నిలుచున్న చోటుకోసం తాపత్రయం. ఒక్క

సారి నిజంగా అనుకునేవాడు. "నేను—ఈ జన్మకాక ఇంకో టయినట్లయితే ఎంత బావుండును! ఆమె చిన్ని గట్టిరొమ్ము లను ఎప్పుడూ తాకుతూవుండే నీలం జాకెట్టు, ఆ బంగారు లోయలో వెచ్చగా నిద్రపోయే సన్నచైన పిరుదులను కాళ్ళను తాకే చీరెను కాకూడదా? ఏ జన్మలో, ఏ గొప్ప సుకృతజన్మమో అట్లా అవిఉండే వరం పొందాయి.

కానీ కొద్ది ప్రయత్నంమీద ఆమె సాంగత్యం లభిం చింది కొంతకాలానికి. ఆ మొదటి అనుభవం ఎప్పటికీ మరపు రానిది. నాగమ్మ ధర్మమాఅంటూ, ఆమె ఇంట్లో కలుసు కున్నారు వాళ్ళు మొదటిసారి. అంతే! ఇంక గాఢమైన అను రాగం. వొకరి నొకరు చీల్చి, కాల్చి, భస్మం చేసుకొనే ఉద్రే కం. ఇది కామమా? ప్రేమా? మోహమా? అనే ప్రశ్నలేలేవు. పుష్కలమైన బలం, మంచిఅవకాశం, వొంటినిండా విద్యుత్తు; ఇంకేం కావాలి! ఏ ప్రేమ, మోహం, కామంగానీ, స్త్రీ పురు షులు వొకరి కొకరు దగ్గరయి, ఒకరికౌగిలిలో మరొకరు లీన మయి, వీలయినంత సన్నిహితం, ఒకేచోట కాకపోతే ఆ పదా లకే అర్థం ఉండదు. వొట్టిచెత్త. ఏ పేరుతో, ఏ సందర్భంలో ఎంత పవిత్రంగా, నిర్మలంగా పలికితేనేం, చివరకు స్త్రీ పురుష కలయికకు చేరుకోక తప్పదు. మరోమార్గమే లేదు...

ఊరంతా తెలిసింది. శ్రేయోభిలాషులు గోడలకు ప్రకటనలు అంటించి కుతులు తీర్చుకున్నారు. ఇంక ఆ ఊరు దుర్భరమయి సరోజినిని రమ్మన్నాడు కుటుంబరావు తనతో మరో ఊరుకు.

"నిజమా?"

అన్నది సరోజిని. అతనన్న మాటల్లో ఎక్కడ ఆమెకు అపనమ్మకం కలిగిందో. అట్లా కలగటానికి పురాతన కాలం నుంచి పురుషులు స్త్రీలకు చేస్తున్న అన్యాయాలు, భగ్న వాగ్దానాలు, మోసాలు, అబద్ధాలు, జాతిలోనే పేరుకొనిపోయి ప్రతి రక్తకణంలోనూ దాగి ఆమెను అట్లా ప్రశ్నించేట్లు చేశాయి గావును. నిజమే నన్నాడు. ఎన్నో ప్రమాణాలు చేశాడు.

"మరి అమ్మ, తమ్ముళ్ళు, పొలం, తోటివాళ్ళు..."

అంటున్నది సరోజిని. ఈ కుళ్లు పదాలు, శుభ్రమైన ఆమె పెదవులు ఉచ్చరించటం భరించలేక, చప్పున తన నోటితో మూశాడు కుటుంబరావు.

"ఒద్దు. ఎందుకు వీళ్ళు నాకు? నా ఆనందానికి అడ్డుగా... తెలుసు. ఇది కృతఘ్నత కాదు. నన్ను కృతఘ్నుడుగా ఉండేట్లు తయారు చేస్తున్నాయి, పరిస్థితులు. నాదేం తప్పు ఇందులో? అవును, వాళ్ళకు మాత్రమేం తెలుసు నా కెట్లా ఆనంద మొస్తుందో? నా జీవితాన్ని నిర్దేశించవలసింది నేను, వాళ్ళు గాదు. నిజమే! హృదయాలను పరాకాష్ఠింప చేయగల వ్యక్తులు దొరకకనే ఈ జనం డబ్బును, పొలాలను, ఉద్యోగాలను, గౌరవాలను అవలంబిస్తున్నారు. వాళ్ళు నిష్కల్మషమనుకునే "ప్రేమ" ఈ హృదయపు ప్రైపొరలను దాటిపోలేదు. అట్లా పోయిననాడు నిజంగా ఇవన్నీ తృణప్రాయాలవుతాయి!"

అతనివాదన. ఆమెతలలో కెక్కుతోంది. నాలుగోనాడు సరోజిని కనిపించ లేదు. కుటుంబరావు బంధువులు అన్ని చోట్లా వెదికారు. పత్రికల్లో వేయించారు.

ప్రతివాళ్ళూ, గొప్పవని వాదించేవీ శ్రమపడేవీ అతనికి లక్ష్యంలేదు. తిరస్కరించి, త్యజించి వచ్చాడు సరోజిని కోసం, ఆమె చిన్ని పెదిమల కాంతిహాసం కోసం. ఆలింగనంలోని లాలిమకోసం, మెడమీది తెల్లచారల నీడలకోసం. ఎట్లా భరిస్తాడు ఆ సరోజిని దుఃఖాన్ని కుటుంబరావు?

మొదట చెప్పకపోయినా ఎంతో బ్రతిమలాడినతర్వాత సరోజిని తలొంచుకుని "పోనివ్వండి—బాధపడతారు మీరు" అన్నది.

"ఇదివరకువాటికంటేనా?"

అన్నాడు అతను. ఇదివరకు తానుపడ్డవి బాధలనిపిస్తూనే ఉన్నాయి గావును అతనికి, ఏ హృదయపు లోతు పొరల అడుగుననో!

"నిజం చాలా పదునైనది!"

"నిజమే చెప్పు"

అతని ముఖం చూసిన తర్వాత సరోజిని అబద్ధమాడలేకపోయింది.

"నేను..."

అని ఆగిపోయింది, అతని ముఖాన్ని చూస్తో.

"నా చిన్ననాటి ప్రాణస్నేహితుడు. ఏం అతను?"

"బావుంటాడు?"

మళ్ళీ ఆమెలో సంకోచం.

"అవును. చాలామంది అంతే అంటారు అతన్ని చూసి"

"అతను...నేను...పోనివ్వండి ... పాపిష్టిదాన్ని...నా గొంతు పిసకండి...చంపండి...నా హృదయం మిమ్మల్ని

మోసం చేస్తోంది. నే నేం చెయ్యను? ఎంత ప్రయత్నించినా మరల్చుకోలేకపోయినాను. దుర్మార్గుడు"

అంటూ చప్పున దూరంగా పోయి, గోడకు ముఖమూ నించి ఖేదపడుతున్నది.

కుటుంబరావు క్షణకాలం నిశ్చేష్టుడయి తేరుకొన్నాడు. సరోజిని వేపు ఆకలిగా చూశాడు. అతని తలలో ఉక్కిరి బిక్కిరిగా ఆలోచనల ప్రవాహం, రకరకాల మృగాలు, జంతువులు, విజృంభించటానికి సిద్ధంగా ఉన్నాయి, కానీ నిరర్థకం. సరోజిని సౌందర్యచ్ఛాయలు, ఆమెమీది గాఢానురాగం మృగ ప్రకోపాలను అణచివేస్తున్నాయి.

అత్యంత సహజమైన విషయం. ఆశ్చర్యానికి, దూషణకు తావులేని విషయం. ఒక మనిషిమీద మరొక మనిషికి వాంఛ కలగటం చాలా మామూలు. ఆ వాంఛను తీర్చుకోవటానికి ప్రయత్నించటమూ విడ్డూరంకాదు. తనేం చేశాడు? సరోజిని కోసం ఎన్ని బైటి విలువల్ని, హోదాలను వదులుకోలేదు. సరోజిని కంటే ఉన్నతులు చాలామంది తనకు తటస్థపడినా, కాదని తోసివేశాడు గదా! అట్లాగే గదా సరోజిని కూడా! పవిత్రంగా ఆరోగ్యంగా ఉండవలసిన మనస్సు మరొక వ్యక్తిరూపాలతో నిండిపోయిన తర్వాత, ఇక శరీరమూ కాపాడుకోటం? జీవమేలేని శరీరం, ఎముకలు, మాంసమూ మాత్రమే కలిగినశరీరం, శిలలాంటిశరీరం, ప్రాణమున్న బొమ్మలాంటిశరీరం.

అతనిలో ఒక దృఢనిశ్చయం, మోసమూ, ఎత్తులూ, వంచనాలేని నిశ్చయం, మెల్లిగాలేచి సరోజిని దగ్గిర కెళ్ళాడు. ఆమె కళ్లు యింకా నీలాలు స్రవింపచేస్తూనే ఉన్నాయి.

"ఇందు కేనా ఇంత అలజడిపడటం?"

అని ఆమె కన్నీళ్ళు తుడిచాడు కుటుంబరావు. సరో జిని దిగ్భ్రమచెంది అతన్ని చూస్తోంది. కుటుంబరావునుండి ఈ మాటలు వస్తాయని, ముందుగా అనుకుని ఉండదు.

"తప్పులేదు. ఇది పశుత్వమూ, వికృతమూ, అపురూపమూ కాదు, హృదయమున్న ప్రతివ్యక్తికీ అనుభవమే యిది. ఎవరన్నా దీనికి నీచార్థాలు కల్పించితే, వాళ్ళకు నీచత్వమంటే ఏమిటో కూడా తెలీదన్నమాట."

"నేను ... పాపి ..."

"ఆగు, సరూ! నీకు ఆ పరిపూర్ణ స్వాతంత్ర్యం యిస్తున్నాను. కొట్టి, అణిచి, బాధించి, బెదిరించి ఎవరూ హృదయాలను అందుకోలేరు. వెళ్ళు. ఆ అవకాశం కలిగిస్తున్నాను నీకు. హృదయ రహితమైన నీ శరీరం దుర్భరం నాకు. నువ్వు ఈ లోకంలో దేనివల్ల ఏ కారణంచేత నయినా సరే బాధపడటం నేను సహించను. నాకు ప్రత్యేక ఆనందమనేది లేదు. నీ ఆనందంలో, నీ సుఖంలో నాకు భాగముంది. ఇందు కేనా నాలుగు రోజులనుండి బాధపడుతున్నావ్?"

కుటుంబరావు అతి సహజంగా, ఏ ఉద్రేకమూ లేక, ఏ తుచ్ఛత్వమూ లేక, సరోజినితో అన్నాడు. ఒక్కసారి ఆమెను కావిలించుకుని, ముఖాన్ని దగ్గిరిగా తీసుకొంటూ ఈ "నాలుగు రోజులు ఏడుపుతో నీ ముఖసౌందర్యమే నశించిపోయింది. ఏదీ చిన్ననవ్వు, కోట్ల వెన్నెలల మృదుత్వాన్ని మించే గొప్ప కాంతిహాసం ..." అన్నాడు.

కళ్ళు తెరిచింది. కుటుంబరావు బైటికి వెడుతున్నాడు. ఆమె కొంచెంసేపు అట్లాగే కొయ్యబారి నిలుచుండిపోయింది. కుటుంబరావును ఇంత విశాలంగా ఆమె యెప్పుడూ అనుకో లేదు. ఇంత కితంవరకూ అతనుకూడా తన యథార్థరూపాన్ని చూపించలేదేమో! చూపించవలసిన అవసరమే కలగలేదో! ప్రతి మనిషిలోనూ మృగత్వము, మానవత్వము, దేవత్వమూ ఉంటాయి. సమయాన్నిబట్టి పరిస్థితులనుబట్టి సంస్కారాన్ని బట్టి అతనిలోని తత్వాలు పనిచేస్తుంటాయి.

సరోజిని కొంతసేపు బాధపడింది ఇంత మంచి భర్తకు అన్యాయంచేస్తున్నానేమో అని. కానీ అన్యాయమా? అని గట్టిగా ప్రశ్నించుకుంటే, కాదనిపిస్తున్నది. అన్యాయమే కావచ్చు స్థూలదృష్టికి. కానీ ఈ అన్యాయాల నన్నిటినీ అధిగమించి, నిశితంగా పరిఢవిల్లే మనస్సు అట్లా కుళ్ళుగా ఉంచుకొని, లోపల ఏమీలేనట్లు ప్రవర్తించటం ఇంతకంటే అతన్ని మోసంచేసినట్లు కాదా?

సీను పెందరాడే వచ్చాడు పని ముగించుకుని. రోజూ అతను, కుటుంబరావు కలిసి స్నానంచేసేవాళ్లు. ఇవ్వాళకూడా అతని కోసమే గావును సీను ఎదురు చూస్తున్నాడు.

"స్నానానికి రండి:" అన్నది సరోజిని సీనుతో.

"వాడు—కుటుంబం రాలేదా ఇంకా?"

"లేదు. కొంచెం పొద్దుపోయిగానీ రాడట. మిమ్మల్ని పెందరాడే భోజనంచెయ్యమన్నారు."

ఆమె కంఠంలో వొణుకువచ్చి, అబద్ధాలు చెబుతున్నా నన్న తీవ్రవేదన లోపల. కొన్నినిమిషాలు అతనిమీద అస

హ్యాం కలిగించుకోటానికి ప్రయత్నిస్తుంది. కానీ కలగదు. బంగారాన్ని ఇత్తడిగా అనుకోవాలని ఎంత ప్రయత్నించితే మాత్రం ఏం లాభం! మామూలుమనుషులు! ఎవరో యోగులకు, ఋషులకు అటువంటి మహాశక్తులుంటాయి గావును; అన్ని వస్తువులనూ సమానంగా చూసేదృష్టి. కాని అది ఆరోగ్యకరదృష్టి కాదేమోననే వాదనకూడా ఉండనేవుంది. ఏవస్తువును, ఆ వస్తువుగా, ఏ గుణాన్ని ఆ గుణంగా గాక, అన్నిటినీ ఒకేకొలబద్దతో కొలవటం, కొలిచి విలువలుగట్టటమూ సాహసమే నంటారు. అయితే, మనం "గొప్ప" అనుకునే వాటిల్లో నిజంగా ఆ గొప్పదనం లేదేమో! "ఉన్నది" అని మనల్ని మన మనస్సే భ్రమలో ముంచుతుందేమో? మనస్సును కమాండ్ చెయ్యగల ధీరోదాత్తులు, అదివేసే వెర్రి వేషాలను అధిగమించి, నిజమైన "అసలు" చూస్తారేమో? అట్లా చూసినప్పుడు అన్నిటి నగ్నరూపమూ ఒకటేనంటే ఎట్లా కాదనగలం? మనస్సునే ప్రధానం చేసుకుని విలువలు మీదు కడితే, మనస్సు కలిగించే భ్రమాసందోహాన్ని దాటి విలువలు మేమ యిస్తున్నామనేవాళ్ళకు ఏముంది సమాధానం?

స్నానం చేశాడు, భోజనం చేశాడు, అతనిగదిలోకెళ్ళి పడుకున్నాడు చదువుకుంటూ. ప్రతిక్షణమూ, సరోజిని అనుకుంటూనేఉంది, అతన్ని పలకరించాలనీ, తాకాలనీ. కాని ఎవరో ఆపినట్లు చప్పున వెనక్కు తిరిగేది. చాలాసేపు ఆలోచించింది. నిజంగా కాదు, ఆలోచించాననుకుంది సరోజిని. కానీ ఏమీ తెలీదు. దూరంగా చీకటి గంటలు వినిపిస్తున్నాయి. అప్పుడప్పుడు రక్తం కక్కుతూ చుక్కలు రాలుతున్నాయి

ఆకాశంనుండి. చెట్లలో మిణుగురు పురుగుల కాంతి ధారలు, కీచురాయి గానం.

సీను మైమరచి నిద్రపోతున్నాడు. దూరంగా దీపపు మరణకాంతి అతనిమీద కొద్దిగా ప్రతిఫలించి ఇంకిపోతున్నది. ముందు చిన్నగా ప్రారంభమై విశాలమైన నీడ, కాంతికి అడ్డు. అతని ముఖంమీద, దిండుమీద, ఘాడుగయిన సువాసనల వెంట్రుకలు. నడుస్తున్నదో, తేలి వస్తున్నదో తెలీకుండానే వచ్చింది ఆ గదిలోకి సరోజిని. ఆమె కళ్ళలో నీరు. జుట్టు అతని ముఖానికి కప్పి, మెల్లిగా అతనిమీదికి వొరిగింది. ఊపిరికిలేచి, అణుగుతున్న వెడల్పుగుండె. అతన్ని రొమ్ముకుతీసుకు ఆను కుంది. అతని పెదిమలను. తన చెక్కిళ్లు వెదుకుతున్నాయి.

"ఎవరూ?"

సీను చప్పున లేచి కూచున్నాడు. అతనికింకా తెలీలేదు, ఆ చీకట్లో తనని పరిమళాల కేశాలతో ముంచింది. దీపం పెంచి చూస్తే—

"మీరా!"

అతని గొంతులో పెద్ద ఆశ్చర్య ధ్వని.

"మీకింకా జ్వరంతగ్గలేదా? కుటుంబమొచ్చాడా లేదా యింకా?"

అంటున్నాడు సీను. స్త్రీ యెప్పుడు యెందుకు యెట్లా ప్రవర్తిస్తుందో తెలుసుకోలేని అతను, జ్వరమనే అనుకుంటు న్నాడు యింకా సరోజినికి.

"రాడీ. మిమ్మల్ని గదిలో వొదలి వస్తాను... వెధవకు బొత్తిగా బుద్ధిలేదు. సుస్తీగావున్న మనిషిని వొదిలి పొద్దు పోయిందాకా రాకపోవటం?"

అని ఆమెనుపట్టుకుని నడిపించడానికి ప్రయత్నిస్తున్నాడు. సరోజిని అతనిమీదకి వొరిగి, బరువంతా ఆన్చింది. చేతులు అతని మెడచుట్టూతిప్పి తనకుఅద్దుకుంది. ఆమె వెచ్చని ఊపిరి అతని ముఖాన్ని కాలుస్తూంది. తెలుస్తూనేఉంది కొం చెం కొంచెంగా ఆమెవాంఛ సీనుకు. వేళ్ళచివర నిశితమైన వేడి, ఆమె రొమ్ములనుండి తనగుండెలోకపాడిచే మెరుపులు—తెలుసుకుంటున్నాడు...అనుమానం. మళ్ళీ వొట్టిదేనేమో? జ్వరంలో వుండే తనకుతను తెలీక ఇట్లా చేస్తున్నదేమో? తనే లేనిపోని భావనలన్నీ చేసుకుంటున్నాడేమో?

ఐతే అనుమానం వెంటనే తేలిపోయింది, నిరాధారమయిందని. ఆమెను గట్టిగాతోచాడు సీను. తూలిబడబోయి నిల దొక్కుకొంది

"వొద్దు తిరస్కరించకు. నీకోసం...నిజం! నమ్మ నా మాట! నీకోసమే ఈ నాలుగురోజులు దిగులు నాకు."

అంటున్నది సరోజని అతనివేపు జరుగుతూ. సీను ఉలిక్కిపడ్డాడు.

"ఆగు, ఒక్కఅడుగు ముందుకువెయ్యకు. మోసం చేస్తున్నావు కుటుంబరావును. వాడికి, నాకుటుంబరావుకు, ప్రాణస్నేహితునికి ద్రోహంచెయ్యలేను."

అని అరుస్తున్నాడు సీను. సరోజినితల తిరిగిపోతోంది, భూదేవి బ్రద్దలయి తనను గర్భకుహరంలోకి లాక్కుపోతున్నట్లు,

గదిగోడలే పునాదులనుండి పెళ్ళగించుకొని పళయ నాట్యం చేస్తున్నట్లు, ఉద్వేగంగా చీకటి పొగలు రేగి ఘోషలు పెడుతున్నట్లు అనిపించింది సరోజినికి.

"నువ్వు మంచిదానివని భ్రమించి నీసౌందర్యానికి దాసుడయి వాడు నిన్ను చేసుకొన్నాడు—తల్లినీ, తండ్రినీ, బంధువుల్నీ, గౌరవాన్నీ, డబ్బునూ వొదులుకొని. నీవు వాడి గౌరవాన్నే నాశనం వేస్తున్నావు. ఛో, వెళ్ళు. వాడూ నేనూ ఒకంచాన తిని పండుకొన్నాము వొకే నుంచంమీద. నాకుటుంబానికి, ద్రోహం, అన్యాయం చెయ్యలేను..."

సరోజిని స్తంభితురాలయింది. చలనరహితంగా గోడకు జారబడిపోయింది. శృంగారమే తెలీని చవటను ప్రేమించినందుకు విచారిస్తున్నదా? లేక, తనభర్తకూ సీనుకూగల, సన్నిహిత స్నేహానికి అందమైన స్త్రీ నిండు హృదయంతో స్వాధీనమవుతానంటే, స్నేహితపు విలువకోసం కాలదన్నిన, అతని ధీరగుణానికి ఆశ్చర్యపోతున్నదా? ఎవరికి తెలుసు?

సీను తొరతొరగా తన సామానుసర్దుకొని వెళ్ళిపోయాడు. తెల్లవారి కుటుంబరావు యింటికొచ్చాడు కళ్ళు ఎర్రగా, మాంసపు ముక్కలకుమల్లే వున్నాయి నిద్రలేక. జుట్టు జీబురుగా రేగివుంది, కాళ్ళనిండా దుమ్ము. రాత్రంతా ఎంత బాధపడ్డాడో అతను?

"సరోజినీ!"

ఆ బొంగురుగొంతుతో పిలుస్తూ కుటుంబరావు లోపలికొచ్చాడు. వొంటిమీద స్పృహ లేకుండా, సరోజిని వాకిట్లో పడివుంది. ఆమె ముఖంనిండా జుట్టు చిక్కుపడి వుంది.

కుటుంబరావు ఆమె దగ్గిరికి వెళ్ళి, తలను వొళ్ళోకి తీసుకొన్నాడు.

"సరోజినీ!"

బిగ్గిరిగా పిలిచాడు. సరోజిని పలకలేదు. కుటుంబరావు కళ్ళనుండి, రెండు అశ్రుబిందువులు ఆమె నుదురుమీద పడి యింకిపోయినాయి.

# పిరికివాడు

"నువ్వు నిజంగా దేవకన్యవు" అన్నాడు వెంకటేశ్వర్లు. అనసూయకు వొళ్ళు మొగ్గలు తొడిగింది. రెండేళ్ళబట్టీ ఆమె మొగుడుతో కాపరంచేస్తున్నా, ఒక్కనాడు గూడా ఆ భ్రష్టుడు అనసూయ సౌందర్యాన్ని మెచ్చుకొన్న పాపాన బోలేదు. నిజానికి ఈ దేశంలో చాలామంది భర్తలకు తమ భార్యల గొప్పదనం తెలీదు; ఎదటివాళ్ళుచూసి, పైకి మెచ్చుకొని, లోపల్లోపల వాడి అదృష్టానికి అసూయపడి, నీతివంతంగా నవ్విందాకా.

తనకు వొంటినిండా సొమ్ములుదిగేసి, సిల్కుగుడ్డలుకప్పి, రుచికరమైన తిండిమేపి, కళ్ళుమూసుకొని కామతృష్ణ తీర్చుకొనే భర్తకంటే, గొప్పగా, విలువగా అనసూయకు కనిపించాడు వెంకటేశ్వర్లు. ఆమెకు తనవొళ్ళు చూచుకోవాలనిపించింది అద్దంలో; తను ఎంత అందంగావుంది! భర్త కోరకపోయినా, తనకుతానై చూపించినప్పటికీ, కనుక్కోలేని అందం ఈ వెంకటేశ్వర్లుకి ఎట్లా కనిపించిందా అని అనసూయకు ఆశ్చర్యంవేసింది.

"నిజం,అమ్మతోడు. నిన్నుచూస్తుంటే గుండెలు పొంగుతున్నయ్. ఎంత అందమయింది నీ వొంటిరంగు–చిక్కని పచ్చకాంతితో చెదురుతోవుండే నీచెక్కిళ్ళు—ఏమిటి వాటివిలువ? ఈ లోకంలోవుండే మొగవాళ్ళు ఏమిస్తారు వాటిని చూసినందుకు? తెలీదు నీగొప్ప నీకు—"అన్నాడు ఆయాసపడుతో. ఆగిపోయినాడు అక్కడ, పైన మాట్లాడలేక.

అనసూయకు తనస్థితి కొద్దికొద్దిగా తెలుస్తోంది అప్పుడే! తను యింతకాలం చలి, వేడి, గాలి, వెలుతురు, చీకటి లేని విచిత్రమైన లోకంలోవుంటే, వెంకటేశ్వర్లనే మహావ్యక్తివచ్చి, తన నీచత్వాన్ని కళ్ళకుగట్టినట్టు విప్పిచెప్పి, తెరిపికి లాక్కొచ్చినట్లుగా అనిపించిందామెకు.

వెంకటేశ్వర్లు చెప్పిందాకా తనలో అంతగొప్ప అందం వున్నదన్నసంగతి అనసూయకు తెలీదు. అరుదుగా తప్పితే లోకంలో ఎవరి విలువలు వారు సరిగ్గా నిర్ణయించుకోలేరు. అందులో స్త్రీలు మరీ. ఎప్పుడో, ఎక్కడో, తళుక్కుమని మెరుపుకుమల్లే, రసనకోసం కలలుగనే తారుణ్యావ్యాదయులు వొచ్చి, ఆమె సొగసును, సొబగును, గొప్పను, ఆమె పురుషుల్లో, లోపలలోపల రగిలించే కోరికలను, ఆమె తనసుచిక్కితే, ఎట్లా ఏయేపద్ధతులుగా ట్రీట్ చేయదలచుకొనేదీ ధైర్యంగా విప్పిచెప్పిందాకా, స్త్రీలు తనప్రభావాన్ని తాము తెలుసుకోలేరు. తలిదండ్రులు ఆమాత్రం జ్ఞానం కలిగించరు కూతుళ్ళకు. భర్తయినాసరే! తనభార్యను మెచ్చుకొని, ఆమె అందాన్ని పొగిడి, తనకు ఆమెవల్లవొస్తున్న ఆనందానికి కృతజ్ఞత చెప్పటానికిగూడా భర్తలు భయపడతారు. అట్లా అనటంవలన పెళ్ళాలకు గర్వంపుట్టి, మాటవినరని వాళ్ళభయం. తను సంపాదించినతిండి తిని, తనఆజ్ఞల్ని నెరవేరుస్తో. తన కుళ్ళునంతా భరించి, గాడిదకుమల్లే వుండవలసిన భార్యను మెచ్చుకోవటం తప్పనుకొంటారు—మరి ఏఆధారంవల్లనో తెలీదు చాలామంది పురుషులు.

అయినా కొందరు భర్తలకు పెళ్ళాం అందగావుండటం బావుండదు. దాని అందాన్నిచూసి మోహిస్తారేమో ఇతరులు, అనేభయం వాళ్ళకు. ఎవ్వరూ మెచ్చుకోని, ఎవ్వర్నీ కదిలించని, సిబ్బెలాంటిభార్యతో గృహస్థధర్మం సంతోషంగా సాగిస్తారుగానీ, సౌందర్య దీధితులతో లోకాన్ని మోహింపచేయగలవాళ్ళను వొప్పరు. భయం లోపల; ఈ"నిధి" తమనుంచి దొరకక పారిపోతుందని. తమ శక్తిమీద అంత విశ్వాసం ఈ పురుషులకు!

ఇంతకాలం భర్తతో కాపరంచేసింది, అతనికి వండి పెట్టింది, అతని యింటిని దొంగలనుండి, జంతువులనుండి, దుర్మార్గులనుండి కాపాడింది. అతనికి యిష్టమైనట్టుగా, అతనికి ఏమాత్రం నొప్పితగలకుండా తననుతను మార్చుకొంది. ఆయన తృప్తికోసం ఫలానా చీరె కట్టుకోమంటే, తనకు అదేమీ బాగుండకపోయినా, ఆచీరె కట్టుకొని, బాగుండలేదన్న భావం తనలో ఎక్కడా కనిపించకుండా అణిచివేసి, తన అంతరాత్మ ఘోషపెడుతున్నా అదిఅబద్ధమని,ఆచీరెబాగున్నట్టుగానే నటించింది. తనకు సొమ్ములు తగిలించి, నలుగురికీ గొప్పగా తనను చూపిస్తే వూరుకొంది. వాళ్ళంతా కనిపించే చీరెలు, ఇంటో అందరూ నిద్రలుపోయినతరువాత, పడకగదిలో కట్టుకొనమంటే కట్టుకొంది. రోగమొచ్చి ఘోరంగా మూల్గుతుంటే పడిపోంది.

ఈ రెండుసంవత్సరాల కాలంలోనూ తనభర్త తననెప్పుడూ అభినందించలేదు. ఇంతచేసినా వెంకటేశ్వర్లు అన్నట్లు యింత అందమయిన వొంటిని వాడికి యిస్తే—ఆఖరికి వొక్క

రన్నా తనను మెచ్చుకొన్నాడా? వెంకటేశ్వర్లు మెచ్చుకొన్న కళ్ళనైనా చివరికి తినుమాత్రం అనుకుందా తనలో యింతశక్తి వుందని? వెంకటేశ్వర్లు చెప్పిందాకా తనకా సంగతి తెలీదు.

అనసూయ అద్దంముందునించొని ఒకసారి తనఛాయను చూచుకొంది. వెంకటేశ్వర్లు అన్నవాటిల్లో వొక్కటీఅబద్ధం అనిపించలేదు. ఇదివరకు అనేకసార్లు అద్దంలో చూచుకొంది తను. మొగుడు తననుగురించి వర్ణిస్తూ తిట్టేవకృతలే అద్దంలో కనిపించేవి అప్పుడు. ఇప్పుడు వెంకటేశ్వర్లు మోహించిన నవ నవలు కనిపించినై. తనమీందతనకే అనంతమైన ప్రేమవొచ్చింది. ఇంతటి వుదాత్త సౌందర్యఖండం ముందు, అతను—తినభర్త, నిలుచుంటానికే అనర్హుడనిపించింది. తను యింతకాలం మోస గించబడింది. ఇంకానా?

వెంకటేశ్వర్లు ఆమెభర్త వుండనిసమయం చూచుకుని వొచ్చి, ఆమెను పొగుడుతూ కూచుంటాడు. ప్రారంభంలో అతనికది కొత్తగానే వుంది. రానురాను అతనిమనస్సు ఆమెను స్తుతించడంతోనే తృప్తిపడటల్లేదు. ఆమెను తనదానినిగా చేసు కోవాలనిపిస్తోంది. నిజానికి అమూల్య పదార్థాన్ని ఎవడు కోర కుండా వుంటాడు? స్వపరభేదాలు తరువాతసంగతి.

ఇంతకాలంనుండీ అజ్ఞాతంలోపడిపోయిన ఆమెమనస్సును వెంకటేశ్వర్లు లేపి రగిలించాడు. ఆమెనుగురించి ఆమెకు నిజం చెప్పాడు, అనుకోనివిధంగా వెలుతురు రావటంవల్ల చీకట్లో వున్న ఆమెకు బెదురుకలిగింది. తననుచూసి మెచ్చుకొంటున్న వ్యక్తికి ఎవడు సానుభూతిచూపించడు? అనసూయ మనస్సులో సహజంగా వెంకటేశ్వర్లుమీంద ప్రేమకలిగింది. ఈ సమయంలో

వెంకటేశ్వర్లు తీసుకుంటున్న చనువుకు ఆమె అడ్డంచెప్పలేకపో యింది ఎంతప్రయత్నించీ గూడా.

వెంకటేశ్వర్లుతో పరిచయం అయినప్పటినుండీ, ఆమెకు తనసంగతి అర్థమవుతో దిగొంచెంగొంచెం. ఇంతకాలా ఆమెకు తనభర్త మన్మధుడుమల్లే, బృహస్పతికిమల్లే కనిపించాడు. కనిపించినా కనిపించకపోయినా కనిపించినట్టుగానే మెలగింది. తప్పదు ఆమెకు. ఆడది లోకంలోవున్న ఉన్నతత్వానంతా మెచ్చుకోక, అదంతా విలువలేని చెత్తగాచూసి, మాట్లాడి, తననేపొగడి, తనలోలేని గొప్పలను సహితం వున్నట్లు ఆమె మాట్లాడుతుంటే, ఆ అబద్ధాలకు అలవాటుపడిన పురుషఆత్మలు సహిస్తాయా, భార్య తనను ఆరాధించనట్లు కనిపిస్తే? అందుకే గావును—స్త్రీకి తనభర్తకంటే వున్నతమూర్తులు, విజ్ఞానధనులు, సౌందర్యవంతులు కనిపించినప్పటికీ బిగ్గరగా మెచ్చుకోనే హృదయం లేకుండాచేసింది సమాజవిధానం.

ఇప్పుడు వెంకటేశ్వర్లువొచ్చి తన మనోనేత్రాలనువిప్పిన తరువాత "సత్యం" చూడగలిగింది ఆమె. తను ఎంతకాలం నీచంగా గుడ్డిగా గానుగెద్దుకుమల్లే బతికిందో తెలిసింది. తనభర్తకంటే నిజంగాచాలాగొప్ప వెంకటేశ్వర్లు. తనకు సాధారణంగా వుండేశరీరం అతనికి అపురూపంగా అగపడుతోంది. తనభర్తను ఏపరిస్థితిలోనూ మెచ్చుకోనేట్టు చెయ్యలేని తను, వెంకటేశ్వర్లును పూరికేకదిలించి, వెర్రివాణ్ని చేసింది. భర్తచేత అసహ్యాం పబడుతో, గౌరవంగా ఆతని నీచపు చూపులకింద బతికేకంటే, ఆ వెంకటేశ్వర్లుతో లేచిపోతే! అతనికిగూడా బ్రహ్మచర్యం పొదల్లేదు.

అనసూయ అట్లా మనసులోనే అనుకుంటోంది. వెంక టేశ్వర్లుతో పోతే భవిష్యత్తు యెట్లా వుంటుందోనని. మొగ వాడుగనక ముందుగా బైటబడ్డాడు అతను. తెగించి అడిగాడు వొకనాడు.

"అమ్మో" అనిఅదిరిపడింది ఆమె. ఇంతకాలం తను స్వగతంగా, ఇంతకుముందే అతనినుండి ఘాటైన మాటలు వినిన ప్పటికీ, వాస్తవంగా అతను పలికేటప్పటికి బెదిరిపోయింది ఆమాటల అదృశ్యశక్తికి.

"రావా!" అన్నాడు వెంకటేశ్వర్లు.

"నేను—నేనా వొచ్చేది!" అన్నది పైకి. లోపలి హృదయాంతరాళ్లో అతనట్లా అనటం సంతోషం ఆమెకి.

"నువ్వు, అవును నువ్వే - నువ్వే! రావా! ఎందుకింత నిర్దయ నామీంద? ఏమిటి నేనుచేసిన అపరాధం? ఎందుకు యీశిక్షనాకు? ఈకాంతిని, యీకళ్ళను, యీవొంటిని తాకే అదృష్టం నాకులేదా? ఆ గాడిదకేనా యీ రసనాకాంతుల మెత్తదనం! వాడు చేసినపుణ్యం ఏమిటి? ఎందుకు నన్నిట్లా ఘోరంగా వధిస్తావు, నీచూపుల లాలినుచూపి, అందపు వెల్లు వనుచూపి? చెప్పు—చెప్పు—రావా!"

ఎందరుప్రియులు అట్లా స్త్రీలముందు మోకరిల్లి, ఆమె కడకంటి చూపుకోసం, పలచని నవ్వుకోసం, దయాపూరితమైన వొక్క-మాటకోసం, అంగీకారం తెలిపే శిరఃకంపనంకోసం ప్రాధేయపడ్డారో ఎన్నివందలు, ఎన్ని వేలు, ఎన్నిలక్షలమంది! అట్లా తమహృదయాలను పరిచారో స్త్రీముందు? నెత్తురులు కురిపించి, యుద్ధాలుచేసి, రాజ్యభ్రష్టులై, లోకాన్ని అసహ్యించు

కొని. శుష్క వేదాంతాన్ని, మననంచేసుకుంటూ, కృత్రిమ సంతృప్తిని పొందుతున్నారో ఆమె దయాలేశాన్ని పొందలేక!

"ఇవన్నీ వొదిలి?" అన్నది.

"వొదిలి"

"నీతో...?"

"రావా? చెప్పు. చచ్చిపోతాను ఇక్కడే. ఇప్పుడే, నీపాదాలముందు గుండెలు బద్దలయ్యేట్లు ఘోషించి చస్తాను. తలబద్దలుకొట్టుకొని చస్తాను. ఎందుకు యిక్కడ నువ్వు? నీసౌందర్యానికి తగినఆరాధనలేని యీదౌర్భాగ్యపుచోటులో? ఇదే! ఈ నికృష్టమే, నీకు సంతోషమిస్తోందా? ఎవరు నిన్ను స్తుతించేందుకు యిక్కడ...?"

అతనిమాటలు, ఆమెను కరిగించినట్లు ఎట్లా తెలిసిందో అతనికి? వెళ్ళి కావిలించుకొన్నాడు. ఎవరన్నాచూస్తారేమో, చూస్తే ఎంతప్రమాదమో అనేసంగతులు జ్ఞప్తికిరాలేదు అతనికి. మోహమనేదే అంత అసలు—

"తలుపు"

"వొద్దు. ముందునేనుచస్తాను. తరవాతనువ్వు......" మిగతామాట పూర్తిచెయ్యలేకపొయ్యాడు. అక్షరాలు గొంతులోనే ఆగిపోయినాయి. పూర్తిచెయ్యటానికి, అతనికి భయం—తన ప్రేమరాసి మరణాన్ని, ఎవరుమాత్రం వూహించగలరు కవీసం?

తనింతకాలంనుండీ, దూరంనించి తలుచుకొని, కలలుగన్న వ్యక్తి చేతికి లభించేసరికి, అతని మనసులోని ప్రేమంతా, వొక్కసారి కట్టలు తెంచుకొని, పైకుబికింది.

"ఎవరునువ్వు?" అన్నాడు ఆమె అంతరాంతరాల్లో చూస్తో. పలకలేదు ఆమె—పలకలేక.

"చెప్పు? ఎవరునువ్వు"

"అనసూ..."

"ఛీ. కాదు. ఎవరు?"

"రాఘవయ్య కూతుర్ని"

"ఛూ" ఛూశాడు.

"సీతాపతి భార్య..."

"వాడు. ఆ పంది పేరు, యీ ముద్దు పెదాలమీద పలకనియ్యకు. నాకు మహామంట వాడంటే. రేపు వాణ్ణి తంతాను డొక్కపగిలేట్లు. పురుగు వాడు."

ఎంతస్వార్థం వెంకటేశ్వర్లుకు: అసలు 'ప్రేమ' అనేదే స్వార్థపూరితం. కాకపోతే ఎందుకు ఎందరో మహాత్యాగాలు చేసి ఆనందపడతారు దేశంకోసం—వాళ్ళ పిసరైనా త్యాగం చెయ్యనివాళ్ళుగూడా చివరకి.

"నువ్వు దేవతవి. కిన్నెరుల గాంధర్వరుతానివి. పసిరిక బయళ్ళమీద బారులు బారులుగా ప్రసరించే వెన్నెలకాంతి నీడవు. ఎడారిలోపడి, యిసికకు సైతం చలనంపుట్టించే తొలి నక్షత్రపు లేతకిరణానివి. నువ్వు అనసూయవుకాదు. ఇంద్రధనుస్సువు. వెలుతురు వానవు..."

అట్లా అంటూ ఆమె చెక్కిళ్ళను, కళ్ళను, మెడను, మృదువుగా తాకుతో మైమరచిపొయ్యాడు వెంకటేశ్లు...

* * * *

అనుసూయభర్త లేనప్పుడల్లా వెంకటేశ్వర్లు వొస్తుంటాడు వాళ్ళయింటికి. ఆమెకు కొత్తరుచుల్ని చూపి, కొత్తదనం నేర్పి, ఎన్నడూ, ఎప్పుడూ, భర్తనుండి తెలియని నూతనరీతులుగా ఆమెను ట్రీట్ చేస్తున్నాడు అతను. కను బొమ్మలమీద వెంట్రుకలకుమల్లే, ఎదుగుబొదుగులులేని ఆమె భర్తతోడి సాంసారికజీవితానికి, వెంకటేశ్వర్లు చేస్తున్న రకరకాల ఎక్స్పెరిమెంట్లు, రీతులు, ఆమెకు భ్రమనుకలిగించి, వూహించని సుఖాల్ని యిస్తున్నాయి. ఆమెకు లోలోపల అతనిమీద ఆరాధన కలుగుతోంది—

కొద్దిరోజులు గడిచేటప్పటికి యిద్దరికీ కాలం భారమయింది. విడిచివుండలేకపోతున్నారు వొకరినొకరు. ప్రతిక్షణం జీవితంలోని వొకభాగం అనుభవించకుండాపోతున్నామే, ఎందుకు యీదుర్భర నిబంధనలు? అనియిద్దరూ అనుకొన్నారు!

కానీ సంఘం వొప్పుకోదు. దంపతులు వొకరియందు వొకరికి జాజ్వల్యమానంగా వెలుగుతున్న ప్రేమలు నశించిపోయి, బొమ్మలకుమల్లే, మనస్సు వేరొకచోటనిలిపి, ఆవ్యక్తే యీవ్యక్తిఅని ఆత్మవంచన చేసుకొని, అంతర్గతంలో వొకరినొకరు భయంకరంగా అసహ్యించుకొంటూ, పైకిమాత వేసిన మురుగుగుంటలకుమల్లే కనిపిస్తూవుంటే చాలా సంతోషిస్తారు. ఇష్టమైన వ్యక్తితో, సుఖంగా వుంటే కులానికి, మతానికి, వర్గానికి అతీతంగా వొప్పుకోరు. వీళ్ళుయెప్పుడు, కూటికిమాడి గుడ్డకుమాడి, ఎక్కాడా తలదాచుకోటానికి చోటుదొరకక, నరకబాధపడతారా అని కనిపెట్టుకొని గుటకలు మింగుతారు.

అనూాయ వీళ్ళకు 'అట్లాంటి'వాళ్ళమీాద—పురుగులకుమల్లే లుకలుకమంటూ జీవించక విశాలంగా బతుకుతున్నారేఅని.

ఒకానొక మహత్తర పునీత నిశివేళ అనసూయను తీసుకొని బండెక్కి చాలాదూరం వొచ్చేశాడు వెంకటేశ్వర్లు. అతనివెంట తెచ్చుకొన్న డబ్బు రెండు మూడు నెలలకంటే ఎక్కువకాలంరాలేదు. తరవాత అనసూయ తనవొంటిమీాది నగలు త్యాగంచేసింది ప్రియుడికి; ప్రాణాలను సైతం ప్రియుల కోసం గడ్డిపరకలకుమల్లే త్యజింపచేయగల మోహానికి యిదొక లెఖ్ఖలోది గాదు.

పాడతారు. ఒకరిగొంతు వొకరికి అద్భుతంగా వినిపిస్తుంది. వొకరిస్పర్శ మరొకరికి రత్నకాంతుల మృదుత్వంవలె వుద్రేకపరుస్తుంది. ఒకరికెదురు వొకరు కూచొని, వెలుతురుగా కరిగిపోతున్న ఆకాశంకేసి చూస్తూ, తెరచాపలకుమల్లే దూది కొండలకుమల్లే తేలుతున్న మబ్బులను గమనిస్తూ, యిదినిజమా స్వప్నమా, అని అనుమానించి రుజువుకోసం వొకరినొకరు తాకి చూసుకొంటూ. అలిసిపోయి, మెలికలుపడి, విడవలేక, నవ్వుకొని, పకుగులెత్తి, కలల్లోకిమల్లే జీవించారు వాస్తవిక లోకంలో నిజంగానే...

*   *   *   *

కొంతకాలంనుండీ వెంకటేశ్వర్లుమనస్సు సరిగ్గా వుండటల్లేదు, కారణాన్ని బైటకు ఏ రూపంలోనూ కనిపించకుండా వుంచేదానికి అతను గట్టిగా ప్రయత్నిస్తానే వున్నాడు. అయినా అది దాగటల్లేదు. అనసూయకు తెలిసింది అతనిలో మార్పు

వొచ్చిందని. అతని చేతలను చూస్తే ఆమెకు తెలిసేది అతని మార్పు.

"చెప్పవా?" అనేది అనసూయ.

"ఏమిటి" అంటాడు అతను.

"దిగులు. నీలోమార్పు. ఎందుకు దాచుకొంటావు లోపల? నాతోగూడా భయమా? నమ్మకం లేదా నామీద?"

"ఏం లేదు"

"వొట్టిది."

"నిజం—అబ్బే" నవ్వాలని ప్రయత్నం చేశాడు—వెనకటి మోస్తరు. కాని మనసులో నిర్మలత్వంలేనిది బయటికి ఎట్లా వొస్తుంది?

"కాదు. నాకు తెలుసు. ఏమిటీనాతప్పు? ఎవరేమన్నారు నిన్ను? నాతో చెప్పవా? దాచుకొంటావా?" అన్నది. కళ్ళల్లోకి చెమ్మవొచ్చింది.

"ఛీ! ఏమీ లేదు" అన్నాడు. ఆమె తడిసిన కళ్ళను ముద్దుపెట్టుకొంటో.

ఆమెకు చప్పున తెలిసింది అది ఆత్మలోనుంచి వొచ్చింది గాదని. నిర్మలమైన మోహాన్ని, అతనినుండి అనుభవించిన ఆమెకు, అతని ముద్దులో, నవ్వులో వెనుకటి వుదాత్తత కనిపించటల్లేదు.

అనసూయ ఎంతబతిమాలినా వెంకటేశ్వర్లు నిజం చెప్పడు. ఎప్పుడూ మొఖంవంచుకొని, దిగులుగా, ఆలోచిస్తూ వుంటాడు. నిద్రపోతున్నప్పుడు ఆమెదగ్గిరికొచ్చి తీక్షణంగా ముఖంలోకి చూస్తాడు; ఏదో రహస్యాన్ని భేధించనున్నవాడి

మోస్తరు. ఆమె ప్రతి కదిలికలోనూ, ఏవో అర్థాలు తీసుకొంటుంటాడు తప్పుడుగా.

ఇదివరకు అనసూయను నిమిషంసేపు విశ్రాంతిగా వుండనిచ్చేవాడుగాదు. ఇప్పుడు ఆమెను అంతగా చూడటల్లేదు. తింటాడు. పిచ్చిగా, వ్యర్థగా వొకమూల కూచుంటాడు. తన కుతానై అనేకసార్లు ఆమె అతన్ని వుద్రేకపరచాలని చూసింది. ఆఖరికి చక్కలిగిలిపెట్టి నవ్వించి, అప్పుడు అతని దిగులును గురించి అడిగి, దానితరుణోపాయం ఆలోచిద్దామని చూసింది.

అతను విసుక్కుని "నన్ను కదిలించబోకు అనసూయా! చిరాగ్గావుంది మనసు" అన్నాడు మొఖం చిట్లించుకొని. ఆమె ఎంతో నటించి, ప్రయత్నించింది. అది అగమ్యగోచరం ఆమెకు.

అతని మనసులోపల మాటిమాటికీ రామారావు బొమ్మ కనిపిస్తుంది. రామారావు కొత్తగా వాళ్ళుంటున్న యింటి పక్కకు వొచ్చాడు ఆఫీసరుగా. ఎర్రగా పొడుగ్గా వుంటాడు. తుమ్మెద రెక్కల్లాంటిమీసాలు సగానికి కత్తిరిస్తాడు. వొత్తుగా వుంగరాలు తిరిగిన జుట్టు మొఖంమీద పడుతోవుంటుంది రామారావుకు. అందమైన బంగారపు కళ్ళజోడు, బూట్లు, పంచెలోనించి డ్రాయరు కనబడుతోవుండి, సిగరెట్ కాలుస్తో వుంటాడు ఎప్పుడూ. అతనంటే వెంకటేశ్వర్లుకు కోపం. అతను మాటిమాటికీ అనసూయవైపుకు చూస్తాడు, పెళ్ళయినా యింకా బ్రహ్మచర్యాన్ని పాలిస్తున్నాడుగనక. పీళ్ళవసారాలో వుండిచూస్తే పిట్టగోడమీదుగా రామారావుపోలు కనిపిస్తుంది

అట్లాగే తనతో మాత్రం అనకుండా వుంటుందని ఏమిటి నమ్మకం?

ఇంతకాలంనుండి గతించిన విషయాలను అడగనివాడు, వొకవేళ అనసూయ నవ్వుతూ ఆ ప్రసక్తిని తెస్తే మండిపడే వాడు, వొకరాత్రి అనసూయను అడిగాడు, ఆమెకు సంతోషంగా వున్నట్లు కనిపిస్తూ వెంకటేశ్వర్లు.

తనతో మనసిచ్చి మాట్లాడనివాడు, యిప్పుడు తనకు తానే ఎందుకు యిట్లామారాడా? అని అనసూయ ఆలోచించలేకపోయింది. తన ప్రియుడు తనతో మాట్లాడిందే పదివేలను కొంది.

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?"

అనసూయ మనసు సగంచచ్చింది ఆ మాటకు. ఎందుకు తన నిట్లా అడిగాడు? ఎందుకు సందేహం కలిగింది తనమీద? ఇంకా ఏవో మాటలనుకుంది ఆమె; తననుగురించి యీవిధంగా అతను దిగులు పడుతున్నాడని తెలీక.

"ఆ. ఎందుకు ఆ సందేహం నామీద నీకు?"

"నువ్వు—వాడు—ఆ భర్తనుగూడా ప్రేమించావా?"

"ఇప్పుడు ప్రేమలేదు."

"ఇప్పుడు—సరే—అప్పుడు—నువ్వు భర్తతో కాపరం చేసేటప్పుడు?"

"ఆహా"

"ప్రేమ లేనట్లుగావుంటే అతను సహించాడా? ఏమీ అనలేదా?"

"ప్రేమిస్తున్నట్టుగానే వుండేదాన్ని ఇష్టంలేకపోయినా."

అతనికి అనుమానం లేదా నీమీద?"

"ఆఁ పోనిద్దురూ. ఆ పాడుసంగతులు యిప్పుడెందుకు."

"అఁహా. కాదు. చెప్పు? అనుమానం కలగలేదా?— కలిగింది కదూ? అవునా? ఏమిటి? లేదా?"

"ఛీ. పోనివ్వండి."

"ఇదిగో! ఇంతేనా నామీద ప్రేమ? పోనీలే, చెప్పవా" అన్నాడు మళ్ళీ గడ్డంబట్టుకొని మెల్లిగా వూయించి, ఆస్పర్శకు ఆమె హృదయం మెత్తబడిపోయింది.

"మనసులో ఏముండేదో నాకు తెలీదు. కాని అతనికి అనుమానం కలగనట్టుగా వుండేదాన్ని."

"నటన. కదూ?"

"గావును"

"నన్ను ప్రేమిస్తున్నావుగదా?"

"ఏమిటి ఆ సందేహం నీకు?"

"వుండు. అతనితో వుంటుండగానే నన్ను ప్రేమించావు గదా?"

"ఆ. నీ మొదటి చూపులోనే నీమీద ఆరాధన కలిగింది నాకు."

"ఎందుకు అతనికంటేఎక్కువ ఏంచూసి నాలో?"

"ఏమిటి యిట్లా మారిపొయ్యారు? ఈపరీక్ష లేమిటి?"

"చెప్పు, ఏం చూసి?"

"గొప్ప"

"ఏమిటి ఆ గొప్ప?"

"చాతకాదు చెప్పడం. పువ్వునుండి వాసనను విడదీయ లేనట్లు నీలోనించి ఆ విలువలు విడదీసి చెప్పలేను. నువ్వు విలువునా గొప్పవాడివి."

"అందం, చదువు, తత్వం..."

"కొంతవరకు"

"మాటవరసకి — నాకంటే గొప్పవాడు కనిపిస్తే— మాటవరసకిలే, అతన్ని ప్రేమిస్తావుగదా?"

"ఛా! మిమ్మల్ని విడిచా?"

"ఎందుకు అవగూడదు? నీభర్తకంటే వున్నతుడనని అతన్నివిడిచి నాతోవొచ్చావు. నాకంటే వున్నతుడు..."

"ఆపండి. ఆమాటకు నాగుండెలు పగిలిపోతై. నేను చస్తాను అప్పుడూ వొదిలేది నిన్ను" అన్నది అతని భుజం మీద తలపెట్టి. కోపంగా, దూరానికి తోశాడు వెంకటేశ్వర్లు.

"చెప్పు. పోతావుగదూ?"

"పోను. మిమ్మల్ని విడవను. నిజం" అన్నది ఏడుస్తూ.

"ఎందుకని?"

ఏంచెబుతుంది అనసూయ?

"నాకంటే మంచివాడు దొరికినప్పుడు?"

"మిమ్మల్ని ప్రేమించాను"

"నీభర్తనుగూడా అంతేగదా?"

"లేదు. నిజం. నమ్మండి"

"ప్రేమించనట్టు కనిపిస్తే, అసహ్యాన్ని కనబరిస్తే, అతను చావదన్నక, విడిచిపెట్టాడా?"

"ప్రేమించినట్టు వుండేదాన్ని"

"ఇప్పుడు నాతోగూడా అంతేనా?"

"ఛీ. మీతోనా?"

"ఎట్లా నమ్మకం నాకు?"

ఆమె ఏ ఆధారాలు చూపి, యిది నటనకాదని రుజువు చేసుకోగలుగుతుంది? రోజూ, నీచమైన పురుషులముందు, నడకలో, మాటలో, చూపులో, అనుమానింపబడి, హింసింపబడుతో, దాని ఘోరబాధనుండి తప్పించుకోలేక, చేసేదితోచక, సహాయంకోసరం, నిశ్శబ్దంగా దేవతలను ప్రార్థించి, గుండెలు పగిలిపోయేట్టు ఘోషించే, లక్షలాది భారతస్త్రీల సాంప్రదాయం, ప్రియుడుతో లేచివొచ్చినా అనసూయకు తప్పలేదు.

"చెప్పు. ఎట్లా నమ్మకం?"

"నాగుండెలు కోసి చూడండి. మీరూపం తప్ప యింకోటి..."

"కవిత్వం చెప్పబోకు. గుండెలు కోస్తే చస్తావు. ఏం లాభం? నీభర్తను ప్రేమించావుగదా...?"

"ఆ". అన్నది యిక దిక్కులేక.

"అయితే నాతో ఎందుకొచ్చావు?"

"మోహించి"

"అదే—అట్లాగే యింకొకణ్ణి—నాకంటే మంచివాణ్ణి మోహించవా?"

"లేదు"

"మంచివాణ్ణి చూసి? నాకంటే చాలామంచి?"

"అహ"

"అయితే అప్పుడు—కాపరం చేసేటప్పుడు నన్నెందుకు మోహించావు?"

"నేనుకాదు. నువ్వే నన్ను మోహించి, ఆకర్షించి, తెచ్చుకున్నావు" అన్నది తనుచేసిన దాంట్లో తప్పువుంటే అది కాస్తా వెంకటేశ్వర్లు మీదికి తోశాననుకుని.

కానీ వెంకటేశ్వర్లు వొదల్లేదు.

"సరే! నువ్వుకాదు. ఇంకొకడు నిన్ను నాకంటే తీక్షణంగా మోహించి ఆకర్షించితే వెడతావు, అవునా?"

"పోను"

"పోనిదానివి, అప్పుడు నాతో ఎట్లావొచ్చావు?"

ఆఖరికి విసుగుపుట్టి, అనసూయ అక్కడనుండి లేచివెళ్ళింది. వెంకటేశ్వర్లు ఆమె వెంటబడి పైటబట్టుకు లాగుతో, "చెప్పు. పోతావుగదా?" అనటం మానలేదు. ఆమెసమాధానం చెప్పలేక ఏడుస్తూ మూలపడుకుంది. వెంకటేశ్వర్లు, లోగడ తను పొగడిన శరీరాన్ని, తన చేతులమధ్య, తన వొంటికింద, పెదిమలకింద, నవనవలుపొందిన ఆమెవొళ్ళును, చితకగొట్టాడు. తన్నాడు. ముద్దులతో పులకలెత్తించిన ముఖంమీద కాండ్రించి వూశాడు. జుట్టు పీకాడు. తల నేలకేసికొట్టాడు చివరికి, హింసించే వోపికలేక అలిసి, రొప్పుతో పోయి పడుకొన్నాడు.

అనసూయ ఏడ్చింది. నీతులతో, ఆచారాలతో, ధర్మశాస్త్రాలతో, దైవభక్తితో, పాతివ్రత్యంతో, జీవత్వంపోయి, కాంతితగ్గి, బిగిసి, కరుడుగట్టిపోయిన, భారత పురుషులకు; ఆత్మలను వక్రించుకొని, నిర్జీవబ్రతుకులను బ్రతుకుతున్న భారత పతివ్రతా తిలకాలకు, ఈ సున్నితప్రాణి భయంకరశోకం వినిపిం

చలేదు. లేచివొచ్చిన దానిని పరామర్శించపోతే, తమ నిర్మ్మలత్వం ధ్వంసమయిపోతుందేమో నని, పాపంచుట్టుకొని నరకానికి పోవలసివొస్తుందేమోనని భయపడి, ఎవ్వరూ పక్కలు దిగక, కదలక, నవ్వుకొని నిద్రపోయినారు.

వెంకటేశ్వర్లు వొంట్లోనుండి వేడిగాడ్పులు పొంగిపైకి. అతనికి 'కిన్నెరుల గాంధర్వరుతం—ఋషికకు సైతం, చలనంపుట్టించే వెన్నెలనీడ'' అనసూయలో కనిపించలేదు. తుచ్ఛురాలు, కులట, పతిత, మోసగత్తె కనిపించింది. భర్తను విడచి, వొకప్రియుడితో లేచివచ్చిన మనిషి, అతన్నివొదిలి యింకొకడితో పోదనీ, పతివ్రతగా వుంటుందనీ ఏమిటినమ్మకం? వుండేదయితే పెనిమిటిని వొదిలి తనతో ఎందుకు వొస్తుంది? ఆ రావటానికి గల కారణాలే యిక్కడ—తనదగ్గర మాత్రం ఎందుకు పనిచెయ్యవు? ఇది కొద్దిరోజులలో తనకంటే మంచివాడితో లేచిపోగలదు ఆ రామారావు వెధవతో. తనే దానికింత కాళ్ళు తెచ్చాడు. 'లేపుకు' రాకుండా రహస్యంగా వ్యవహారం జరుపుకొంటున్నట్లయితే బాగుండేది. అప్పుడు తనను గాదని మరొకడితో సంబంధం పెట్టుకొన్నా తనింత కష్టపడేవాడు గాదేమో! ఎందుకంటే అనసూయ తనభార్య గాదు. ఇక్కడ భార్య గాకపోయినా, ప్రియురాలు. అయినా... ఇది వేరు సంగతి...

అనసూయ ఏడ్చి, ఏడ్చి, వోపికలేక, అలిసి, నిద్రిపోయింది. వుదయం లేచేసరికి వెంకటేశ్వర్లు పక్క కాళీగావుంది. అంతే! ఆతరువాత గూడా అతను, అనసూయ కెప్పుడూ కనిపించలేదు.

# దృష్టిభేదం

పెద్దపార్కు. రకరకాల ప్రజలు గుంపులుపడి అక్కడి ప్రకృతి సౌందర్యాన్నే ధ్వంసంచేశారు. నిశ్శబ్దంగా, ఆకాశపు నీలాన్ని, రంగులమబ్బుల్ని, పక్షుల సంతోషరవాలను అనుభవించలేక, ఎదుటివాళ్ళు అనుభవించకుండా గూడా జాగ్రత్త తీసుకొంటున్నారు; నవీనభారత సౌందర్యారాధకులు, వీరులు.

పార్కులో ప్రతిమిల్లిమీటరు ప్రదేశంలోని అందమూ అదివరకే మురికిచేయబడటంచేత, సుందరం తన పాతస్నేహితులను చాలామూలకు గన్నేరు గుబుర్లమధ్యకు తీసుకువెళ్ళాడు. అతను మొన్ననే యీవూరువొచ్చాడు—పట్నంలోని తన పెద్ద వుద్యోగానికి తాత్కాలికంగా శెలవుపెట్టి తన పాతప్రియురాలు "శశి"కోసం. అందరికీ తెలుసు యీసంగతి. వొక్కరూ అనరు పైకి; సుందరంగూడా చివరికి. మితుృల్ని చూట్టానికి వొచ్చానట్ట. మరింకగతిలేదు అతనికి అబద్ధం ఆడటంతప్ప. కార్యక్రమమంతా తృప్తిపడ్డా జరుపుకొంటూ, 'అక్కయ్య'-'పిన్ని' 'చెల్లెలు' అంటూ పైకి దొంగకూతలు కూస్తుంటే చాలు. అక్కడికి సంతృప్తిపడటం జరుగుతుంది యీమాటలు వాళ్ళ మనసుల్ని కంట్రోల్ చేస్తున్నాయా? అవయవాలు పనిచెయ్యకుండా ఆపుతున్నాయా? జవాబులేదు యీ పశ్నలకు—

సుందరం 'గొప్పవుద్యోగం చేస్తుంటేనేం? అతనిలో శృంగారపు sense ఇంకా చావలేదు. అసలు ఆ వుద్యోగం

చెయ్యటం మిసెస్. డాక్ కోసమని కొంతమంది అంటారు. అతను మాత్రం 'డాక్' నాకు తెలుసు. చాలా అందమైన 'ఛాప్' అంటాడు నవ్వి.

అతని జీవితం శృంగారపరంగా అద్భుతంగా వెలిగింది. గత జీవితచరిత్రపుటధ్యాయాలను చెబుతుంటే, శ్రోతలు మైమరచిపోతారు—ఎంకి పాటలను వింటున్నట్టు. కృష్ణశాస్త్రి 'ఊర్వసి' చదువుతున్నట్లు. నిజంగా ఆ అనుభవాలే అంత శృంగార పుంఖితమో, లేక అతను చెప్పేపద్ధతే గొప్పదో!

సంభాషణ చాలా నీరసంగా ప్రారంభమయింది, ఏదో ఫౌంటెన్ పెన్ మీద. ప్రారంభించింది రంగడు.

"ఇది చాలాగొప్ప కలం"

"అవును. అద్భుతంగా రాస్తుంది"

"అందమయిన పాళీ, చక్కని క్లిప్. ఎంతకొన్నావురా సుబ్బలూ?"

"వీడు కొంటాడా? ఎక్కడో కొట్టేసివుంటాడు; ఇంత మంచికల ..."

"నోర్ముయ్‌రా ఘుణియా. మూర్తాండం ఫౌన్సీషాపులో ఇరవై నాలుగుంబేడా...వొరేయ్ ఆ బుద్ధి...ఏదీ... కొట్టెయ్యటం...నా వెంటతిరిగే వారికిగూడా లేదోయ్...అనుకున్నావేమో?"

"ఎందుకోయ్ అంతకోపం? వూరికేనేఅంటే వాడూ?",

"కోపంరాదా? అందమైన భార్యను తెచ్చుకొంటే 'ఇదెవరు? నీకేమవుతుంది? ఎక్కడ కొట్టుకొచ్చావ్? అసలు దీని మొదటి మొగుడెవడు? మాగ్గూడా యామన్నా ఛాన్సు యిప్పి

స్తావా?' అంటే కోపంరాదా ఎవరికన్నా" అన్నాడు పెద్ద యజమాని.

'ఆపండిరా వెధవాయిలూ! ఎప్పుడూ వొకటేరొద. పతివ్రతలకు నిలయమైన భారతదేశంలో, ముఖ్యంగా తెలుగు నాడులో, కాస్త జాగ్రత్తగా, రహస్యంగా పరిశోధిస్తే ఆడవాళ్ళు కోకొల్లలు.' అన్నాడు పాండు.

'పోతాను' సుందరం లేచాడు.

"ఏం?"

'అప్పుడే?'

'నీకోసమని కానుటోయ్ ఇప్పుడు పార్కు కొచ్చింది నేను. లేకపోతే, ఆ నరసమ్మ నాకు చేదయ్యా?" అన్నాడు కేశవరావు.

"ఇదా? ఇదిట్రా నాకోసం రావటం. బతుకు మొత్తం, కేకలు, రొదలు, కాగితాలు, అంకెలు, అనుమానాలు అయితే ఏం చావరాదూ..."

"నీళ్లులేని బావిలోదూకి" అని పూర్తి చేశాడు వొకడు.

"తగాదాలు వద్దు., సుందరం తెలిసినవాడు మనకంటే. ఒరేయ్ ఈకలం ఎంతవుతుందో ఖరీదుచెప్పు ఖచ్చితంగా. పట్నంలో వున్నవాడివి. బాగావిలువలు కట్టొచ్చు."

'నాకు తెలీదు'

"చూడరా అసలు"

"వొరేయ్! ఆడవాళ్ళకు విలువ కట్టడంతప్ప సుందరం గాడికి మరింకేమీ తెలీదురా!"

అందరూ గొల్లుమన్నారు.

'అదీ సరిగ్గా నాకు తెలీదు. ఒకసారి అందులోగూడా శ్రీవారు పప్పులో కాలేశారు'' అన్నాడు సుందరం.

''హా. హాతవిధి! సప్తసముద్రము లింకనూ...''

''కాదోయ్! ఇప్పటికి ఐదుసముద్రాలే కనిపెట్టారు''

'పోనివ్వ...ఆఁ...పంచసముద్రము లింకలేదా? ఆకాశంబు బ్రద్దలుకాలేదా?...'

'మళ్ళీ వోస్తా...' అని సుందరం లేచాడు. అప్పటికి చీకటి పడింది. విద్యుద్దీపాలు విధవల ముఖాల్లాగా వెలుగుతున్నాయి. ఇంకా జనం రొద.

''నిన్ను పోనిస్తానుటోయ్, కంఠంలో వూపిరివుండగా. ఆ వెళ్ళబెట్టే దేమిటో పూర్తిగా బైటికికక్కు, లేదా...?''

'ఏమిటి కక్కటం?' అని ఆశ్చర్యపడ్డాడు సుందరం.

'అదే, నువ్వెక్కడ ఆడవాళ్ళకు విలవ కట్టలేక పోయ్యావో...'

''ఊఁ, పోనివ్వండిరా...అబ్బబ్బా. వొక్క నిమిషం వూపిరి తిరగనియ్యరు...చూడండిరా తగ్గిపోతున్న ఎండ బరువుకు కదలలేక, కోపంతో ఎర్రబడ్డ ముఖాల మబ్బులు...''

''ఛస్. కవిత్వంవొద్దు. కబుర్లు. నువ్వు బోల్తాపడిన కబుర్లు కావాలి. మేము గర్వించే నువ్వు, పరాజయం పొందటం విని సంతోషిస్తాం'' అన్నాడు కేశవులు.

'ఇక తప్పదా?' అన్నట్టు అందరివేపూ చూసి ''ఒకసారి ...''అన్నాడు సుందరం.

'ఎప్పుడు?''

'తంతా, రోయ్ ...''

'హాత్తోస్మి! ఒకసారి...ఊఁ'

'చాలా రోజులైంది. అప్పుడు మనకింత అనుభవం ఎక్కడేడిచిందీ! నెల్లూరులో దిగాను.''

''ఎందుకురా నెల్లూరులో దిగటం?''

''భగవాన్!''

అన్నాడు సుందరం తలపట్టుకొని.

'పొండిరా వెధవలూ' అని రంగడు వాణ్ని కసిరి ''నెల్లూరులో దిగావు. తరవాత?''

'దిగాను, గోవిందాయ్‌ని పిలవటంకోసం. అప్పుడు వాడేదో పత్రికలో వుద్యోగం వెలగబెడుతున్నాడుగా. వాళ్ళ నాన్నకు వాడినిగురించి వొకటే దిగులు.''

'మానాన్నకూ నన్నుగురించీ దిగులే! ఇకముందు నేనెట్లా బతుకుతానా అని'' కేశవులు గొణిగాడు.

'ఎక్స్‌ప్రెస్ ఎన్నింటికి?' అన్నాడు సుందరం లేస్తో.

అందరూ కలిసి సుందరాన్ని బలవంతంగా భుజాలువొంచి కూచోబెట్టి, ఎవ్వరూ పలక్కుండా వొట్లు వేసుకొన్నారు వాళ్ళల్లోవాళ్ళు

'వాళ్ళ నాన్నకు నా తెలివితేటలమీద అమోఘమయిన విశ్వాసంవుంది. నేనెట్లాగైనా గోవిందాయ్‌ని ఇక్కడికి తీసుకురావాలి. నెలూరులో వాడు అదెవత్తో 'రోహిణి'ట, దాన్ని వుంచుకొని చెడిపోతున్నాట్ట, ఈ చీదరనుండి, దిగుళ్ళనుండి, కంపునుండి విడివడి, హాయిగా, శాంతంగా ఆ 'రోహిణి'తో జీవనానికి మెరుగు పెడుతున్నవాణ్ని బెదిరించి, అది

లించి, మోసపుచ్చి వాడిమొకకు పెళ్ళాం వురిని తగిలించాలిసిన మహత్తర బాధ్యత”

‘నీభుజంబులమీద నతగాడు మోపె నన్నమాట’ అని పూర్తిచేశాడు పాండు.

‘వాళ్ళనాన్న ఏదో అడ్రస్‌యిచ్చాడు గానీ, రైల్లో ఎక్కడో పోయింది. జ్ఞప్తికిగూడా లేదు...’

‘పోనీ పేపరు ఆఫీసుకు వెళ్ళకపొయ్యావా?’

‘ఎప్పుడు? రాత్రి తొమ్మిదింటికా? సాయింత్రం మూడు గంటలబండి, ‘అనివార్య కారణాలవల్ల’ తొమ్మిదింటికి ఆగింది నెలూరులో. అక్కడికి వెళ్ళాను ఆఫీసుకు. మూసి వుంది. వ్యాన్ని గురకనుండి లేపి అడిగితే, చేతిని వీపువెనగ్గా తిప్పి చూపించి, ‘అక్కడ అడిగినారా—తప్పక సెపుతారు’ అని కళ్ళుమూశాడు.

‘ఏంచెయ్యను? ఎక్కడ పండుకోను? ఎవరూ తెలవదు. ఎట్లా ఈరాత్రి?’

‘అన్నం తిని అట్లా హోటలు ముందు కూచుని వున్నాను...’

‘ఇంతలోకే ఒకవమ్మాయి మాంఛి యవ్వనంలో వున్నది కనిపించివుంటుంది. అంతేనా?’ అన్నాడు రంగడు, ఈ సంభాషణ మామూలేగా అన్నట్టు గొంతుమార్చి.

‘ఇది కథ కాదుగా అట్లా కనిపించటానికి. పోనీ యీ రాత్రి... అనిపించింది. గోవిందాయ్‌మీంది కోపం తగ్గుతుంది. ఈరాత్రి గడుస్తుంది గూడా. గడపటానికి ఏహోటల్లో తీసుకో వచ్చు ననుకోండి. ఊరికే ఎంతమందికి గడవటల్లేదు గనక,

అతను కనిపించకపోతే ఈవిషయం మీతో చెప్పే అవసరమే వుండివుండదు.''

'వాడెవడ్రోయ్? నిన్ను జూచి ఇక్కడున్నావేం అల్లుడూ? అంటూ ఇంటికి తీసుకుపోయి'

'నే నెంత బుద్ధిహీనుణ్ణి! నాలుగు అస్త్రాల్ని బిళ్ళలన్నా తెచ్చుకోలేదు' అన్నాడు సుందరం తల నొక్కుకొని.

'మాట్లాడితే చడ్డవొట్టు... ఇక కానివ్వరా సుందరం,' అని పెద్ద బూతువొట్టు పెట్టాడు కేశవులు.

సుందరం దగ్గి, గొంతుసరిచేసుకొని మళ్ళీప్రారభించాడు.

'వాడి వేషాన్ని బట్టి, మనం వెంటనే సంగతి గ్రహించుకొన్నాము. వాడి ఇలాకాలో అయిదారుగురు అమ్మాయిలు వున్నారట. సరే పదమన్నాను. వాడు రోడ్లన్నీ తిప్పితిప్పి...''

'... ఒకచీకటి గొందిలోనికి తీసుకెళ్ళాడు.' అనగానే వొకరు.

'ఇంకేం! ఆ తరువాతగూడా నువ్వే చెప్పు? నేనెందుకు వాగటం!'' అన్నాడు సుందరం దిగులుగా.

..........

'ఆబజారంతా యిరుకే. ఇళ్ళమీదయిళ్ళు కుక్కుకొని వున్నాయి, వాడు నన్నొక పెంకుటింట్లోకి తీసుకు వెళ్ళాడు. వసవాలో దూలానికి హరికేన్ లాంతరు. చిన్నడాయసు. రెండు మూడు ముసలికుర్చీలు. నావెంట వున్నవాడు లోపలికెళ్ళి మాట్లాడి వొచ్చాడు. కాసేపటికల్లా ఒక మనిషి వొచ్చింది లాంతరుకు దగ్గిరిగా నాకు బాగా కనిపించేట్టు...''

'ఆమె అందాన్నిచూసి భ్రమించి ఆరాత్రి ఆమెతో గడిపావు. ఏమిట్రా నీగొప్ప! ఈపని ఏ వెధవయినా చేస్తాడు. ఇదేనా మహాపొడిచి గెలిచినట్లు...' ఇట్లాఅంటూనే వున్నాడు పాండు.

'నారాత బద్దలయి ఈవిషయం మీముందుఎత్తానురా బాబూ! చివరికంటా వినకుండానే వ్యాఖ్యానిస్తే ఏంచేసేది నేను?' అన్నాడు సుందరం—

'కాదుటోయ్? మనవాడేదో ఘనకార్యం చేశాట్ట. తరువాతనో దేవా!'

'ఎంతలని అడిగాను. పదిట. ఆమెనుచూశాను. ఏమంత బావుండలేదు. సన్నగా చామనచాయగా వుంది. మొఖంమీద మచ్చలు...'తరవాత వొస్తాను' అని నేను బైటపడ్డాను వెంట నున్నవాడితో.

'ఏం? బావోలా?' అన్నాడు సంధాతకుడు.

'అట్లావుందేం? సోడాకాయముఖం అదీనూ, ఇంకా మంచివాళ్ళు దొరకరా?' అన్నాను.

'అయ్యో లేకేం! దీని బాబులాంటోళ్ళున్నారు రండి'

'దీని బాబులాంటోళ్లున్నప్పుడు దీని దగ్గిరికే వీడెందుకు తెచ్చాడో నన్ను' అర్థంకాలేదు నాకు. ఇంకో యింటికి వెళ్ళాము. కాస్త కుడియెడంగా ఇంతే! అక్కడున్న అమ్మాయి ఒక వికారపు నవ్వునవ్వింది రోమ్ములుకదిలేట్టు. దగ్గిరిగావొచ్చి చేతిలో సిగరెట్టందుకుంది.'

'ఆంగ్లోయిండియన్ కాదుగదా కొంపతీసి!'

"అబ్బే నాటుసరుకేనోయ్. ఆమె ఖరీదు వొకరాత్రికి పదిరూపాయలేనట. బైటికొచ్చాను. సంధాతకుని ముఖంమీద విసుగు నిరాశ కనిపిస్తోంది. లైటు వెలుగున అతన్ని చూచినప్పుడల్లా, ఏంచేయను? వీడి తృప్తికోసం కుళ్ళు సరుకును ఎక్కడ భరించను!"

"మరి ఆరాత్రల్లా అట్లాగే తిరుగుతున్నావా?"

"అయిదారు కొంపలు తిరిగినా నచ్చలేదు నాకు. చివరికి "ఇక్కడ వొక అమ్మాయి వొచ్చింది కొత్తగా" అన్నాడు వాడు.

"ఎక్కడికి?"

'ఇదే ఈ పక్కింటికి'

'అయితే పోయి చూద్దాం'

'కానీ...'

'అతను నసుగుతున్నాడు'

'ఏమిటి?'

తలవొంచి పలకడు.

'ఏమిటి సందేహం నీకు?'

అతను తలెత్తి

'ఆఁ ఎందుకులెండి! లాభం వుండదు.'

నాకు ఆతృత హెచ్చింది.

'ఏం? ఏమిటి కారణం?'

'అబ్బే ఎందుకూ వీలుకానిది. ఇంకోచోటికి పోదాం.'

"వొద్దు, ఆయింటికే పోవాలి."

"నావల్లకాదు. నిన్న మొన్నటి దాకా సంసారంచేస్తున్న మనిషి. భర్త అమాయకుడు. మెత్తటిమనిషి. అత్త మహాగయ్యాళ గ్రాయ. తెగ వేధించుకు తినేదట..." అంటున్నాడు.

"దాన్ని...ఆ అత్తను బద్దలుగా, నిలువుగా చీల్చాలి" అని అరిచాను

"వహావ్వా! వాహావ్వా!! ఏం ధీరవీర ప్రదర్శనరా సుందుగా! అత్త సంగతి దేవుడెరుగు...కోడలినన్నా మరి"

"విను. రసకంధాయపు పట్టే ఇక్కడ"

అందరూ శ్రద్ధగా ముఖాలు పెట్టారు.

'అట్లాగే ఆపిల్ల మూడేళ్ళు భరించింది. అఖరికి వోర్పు తగ్గి ఈవూరొస్తే మీనాక్షి చేరదీసి కన్నబిడ్డకుమల్లే సాకుతోంది' అన్నాడు వాడు.

'అయితే చూడాలి మనం తప్పక'

'మీనాక్షి రాకాసిముండ. పైగా యామనిఅరుస్తుందో యీమాటకు. అయినా ఆపిల్ల వొప్పుకొంటుందా యిందుకు? సంసారం చేసినపిల్ల?'

'ఎట్లాగయినాసరే కుదుర్చు. నీకష్టం వుంచుకోను'

'అబ్బే అందుకాదండీ! మాట దక్కదేమోనని— పెద్దమనుషులతో పని' అని గొణుగుతున్నాడు.

'కాదు, ఎట్లాగైనాసరే! కావాలంటే రెండు రూపాయలు అదనం నువ్వేతిను. నీదిమాత్రం కష్టంకాదా' అన్నాను.

'పీకమీాదకు తెచ్చుకొన్నానే' అంటూ వాడు నన్ను అరుగుమీాద కూచోబెట్టి, లోపలికెళ్ళి అరగంట కొచ్చాడు బైటికి. నాగుండె పింజంపింజం అంటోంది యేమయిందోనని.

'ఏమయింది' అన్నాను తడిఆరిన గొంతుతో.

'వాడు నవ్వి—'

'పంతులుగారు నక్కను తొక్కివొచ్చారు. మొదట్లో ఆముండ కేక వేసింది. మీారు మర్యాదస్థులనీ, పెద్దమనుషులనీ, దారితప్పివొచ్చారనీ—అన్నాను. కానీ పాతిక రూపాయలకు తక్కువ వొద్దన్నది. ఆడబ్బున్నా ఆపిల్ల గుడ్డలకేనట. యేమంటారు?' అన్నాడు.

"ఓ"

"వాడికి ఐదుయిచ్చి లోపలకెళ్ళాను. యేాభయ్యేళ్ళది వేలితో గదిచూాపించి పోయింది. తలుపు దగ్గరగా వేసి, ఆ పిల్ల కేసి చూశాను. తలవొంచుకొని దిగులుగా కనపడ్డది. తళుకులు, బెళుకులూ లేవు. చాలా సాదాతనం ఆమె. ముగ్ధ, గొప్ప అందం."

"ఒరేయ్! కవిత్వం ఆపు. అసలు సంగతి?" అన్నాడు రంగడు.

"ఏముందీ, ఆగొప్ప అందాన్ని. ఆ మొగుడుదవ్వ, నా వుద్దేశం ప్రకారం అంతవరకూ యింకెవరూ తాకని, మెత్తని, నున్నని, గుండ్రని ప్రదేశాలు. పాతిక యిచ్చాను ఉదయం పోతోపోత్తో" అని నవ్వాడు సుందరం.

"ఇందులో నీ పప్పులో కాలువెయ్యటం ఏముందీ?" అన్నాడు రంగడు.

"ఓ. అదా! ... ఉదయం, గోవిందాయ్‌ని కలిశాను. వాడికి పెళ్ళిలోని ఆనందాన్ని చెప్పాను. పూటపూటకు దేన్నో ఒకదాన్ని దేబిరించకుండా స్టోర్‌రూం లాగా వుంటుంది భార్యంటే అన్నాను. సరే, వాడూ నేనూ అరుచుకొన్నాం కాసేపు. ఎట్టాగయితేం మెడలువిరిచి రాత్రి మెయిలుకు ప్రయాణం గెలిచాను వాడిమీద. ఏదో సరుకులకోసం సాయంత్రం అట్లా బజారుకొచ్చాం. ఆ పిల్ల—సంసారం వొదిలివచ్చిన అమాయక గృహిణి, రాత్రి పాతికరూపాయల అనుభవం అమ్మినమనిషి—ఇంకెవరితోనో బండిలో పోతున్నది.

"అరె! ఆ పిల్ల గృహిణీమణి అన్నావుకదరా మరీ! ఇంకెవడితోనో అంటా వేం? ఒకవేళ దాని మొగుడేమో? కనుక్కొన్నావా?" అన్నాడు పాండు—

"గోవిందాన్ని అడిగాను"

"ఎందుకు?" అన్నాడు గోవిందం.

"పూరికే నే"

"చంపకం"

"లక్ష్మమ్మకాదా?" అన్నాను ఆశ్చర్యంతో.

'నీకేం తెలుసు?'

జవాబుకోసం చచ్చాను.

'ఆమె సంసారస్త్రీకాదా? మొగుడు అక్కుపక్షి అయితే అత్తపోరు పడలేక యీవూరు రాలేదా?'

'ఎవడో నీకు టోపీపెట్టాడు' అని నవ్వాడు గోవిందం—

'అది సంసారపుదీకాదు పాడూకాదురా. ఇదొక వేషం!

ఎంతమందిని చూపించినా కాదంటున్నానని ఆ గాడిదకొడుకు యీ పన్నాగం పన్నాడు' అన్నాడు. సుందరం.

'మరి నువ్వుగూడా మొదట్లో తెగ పొగిడావేం?' అన్నాడు కేశవులు.

'ఏం చేయను? వాడు చెప్పినమాటలు నమ్మాను. ఆ దృష్టిను ఊచూస్తే అట్లానే కనిపిస్తుంది.

'అది సంసారపు స్త్రీ అనగానే, నిజంగా నాకళ్ళకు అంతే అనిపించింది. వస్తుతః లేకపోవొచ్చు. కాకపోయినా మనకై మనమన్నా సృష్టించుకొంటాము అందులో చాలా మంచిస్థితిలోంచి వొచ్చిందంటే గౌరవంకదా! అదేచూశాను. వాడు—ఆదొంగ వెధవ—ఇదీ మామూలు మనిషేననీ, దీని విలువగూడా పదిరూపాయలకు మించదనీ చెప్పినట్లయితే, దీన్ని గూడా కాదనేవాణ్నేమో! అందుకే వాడు, ఖరీదు పెంచి, మెరిపించాడు నన్ను' అని తలవొంచుకొన్నాడు సుందరం.

# పున్నాగ

మాఆవిణ్ని రైలెక్కించి యింటికొచ్చాను. ఇల్లంతా బావురుమని నన్నుచూసింది. మరోవ్యక్తి తోడుగాలేని ఈ యింట్లో, ఎంతలేదన్నా మూడునాలుగు నెలలయినా నేను గడపాలి. అది ఈపాటికి కొలకలూరు దాటేవుండొచ్చు. మరో మూడున్నరగంటల తదనంతరం, హాయిగా వాళ్ళఊరు చేరుకొంటుంది. పుట్టిల్లుగనక దానికక్కడ కాలక్షేపానికేమాత్రం లోటుజరగదు. ఎటుగూడీ యిబ్బంది పడవలసిందల్లా నేనే! మాఆవిడకు నెలతప్పటమనేది నాకు సంతోషకరమయిన విషయమే! కానీ ఈవంకతో ఆవిడ నెలలలెఖ్ఖలో పుట్టింట బిచాణా పరచటం నేను మెచ్చుకోలేను. ఏది ఏమైనప్పటికీ అది వెళ్ళిపోయింది. దాన్నిపోకుండా చెయ్యాలన్న నా ప్రయత్నాలన్నీ వీగిపోయినాయి. మునుముందు పుట్టిన ఆడబిడ్డ నా యిట్లోనే మొదటిపురుడు పోసుకోవాలని మా మామ పట్టు పట్టటంవల్ల తప్పించుకోలేక పోయినాను. అందులో మాయింటిదానికి గూడా కొంత 'రిలీఫ్' అవసరమని తోచింది గావును—శివ తాండ్రి వాదాన్ని బలపరిచి, ఆయనతో బాటే ప్రయాణమైంది.

శ్రీమతి తిరిగి వొచ్చిందాకా, కాలం ఎట్లా గడపాలా అన్నదే నాకు ముఖ్యమైనప్రశ్న. కాస్తోకూస్తో కొండ్రవున్నది. దాని మక్తాడబ్బుతో జీవితం హాయిగా గడుస్తుంది. ఎముకలు విరుచుకొనవలసిన అవసరం లేదు. కాలక్షేపానికి రకరకాల మార్గాలు తోచాయి. కానీ అవేవీ నాకంతగా నచ్చలేదు.

వాటివల్ల ఏదో విధంగా కాలక్షేపం జరగకపోదు కానీ, అంత కంటే హుషారుగా కాలం గడపగలందుకు కేదన్నా వుంటుం దేమోనసే దురాశ నన్ను విడవకపోవటంచేత నాలుగైదు రోజులదాకా ఒకనిర్ణయానికి రాలేకపోయినాను.

అదృష్టవశాత్తూ, ఈ స్తంభిత వాతావరణంలో నేనెక్కు వకాలం వుండనవసరం లేకపోయింది. అవ్వేళ మధ్యాహ్నం సిగ రెట్టు కాలుస్తుండగా బ్రహ్మాండమైన, మహత్తరమైన, ఆలో చన నాబుర్రలో 'ఠఫీ'మని మెరిసింది. గబగబా ఉత్తరాలన్నీ దుమ్ముదులిపి చదవసాగాను. చలపతి రాసిన ఉత్తరం, ఎక్కువ శ్రమపడకుండానే దొరికింది. దాన్ని వాడు రాసి నాలుగునెలలు దాటిపోయింది. ఇంతకాలమూ, వాడా సమస్యను విడగొట్టు కొన్నాడో, లేక దానితోనే సతమత మవుతున్నాడో నాకు తెలీదు. వాడొక అపురూప సుందరిని పెళ్ళి చేసుకొన్నాడుట. ఆపెళ్ళి చాలా విచిత్రంగానూ, ఎవ్వరూ అనుకోని విధంగానూ జరిగిందట. వాళ్ళిద్దరూ పరస్పరం ప్రేమించుకొనే ఆపెళ్ళి చేసు కొన్నారుట. కానీ పెళ్ళివల్ల 'నాకు పిచ్చెక్కే పరిస్థితి దాపు రించింద'దని చలపతి రాశాడు. ఇంతకాలమూ నేనా విష యాన్ని ఖాతరుచెయ్యనిమాట నిజం! మాఆవిడ పుట్టింటికి వెళ్ళకపోతే, ఈనాటికీ నేను చలపతి విషయం పట్టించుకొనే వాణ్నిగాదు. లోకంలో అనేకవందల మందికి, అనేకవందల సమస్యలు ఈవివాహాలవలన కలుగుతున్నాయి. వాటన్నిటినీ తీర్చటమే నాడ్యూటీ కాదుగదా!

కానీ ఇక్కడి సందర్భం వేరు. ఈ వుత్తరాన్ని పురస్క రించుకొని, నేను చలపతిదగ్గరకు వెళ్ళటం చాలా ఉత్తమమని

పించింది. వాడెంతో మథనపడిన తరవాత గానీ. ఈ ఉత్తరం రాసివుండడు. నేను వెళ్ళి ఆ 'మథన' ఏమిటో, అదెందుకు వొచ్చిందో, దానినుండి తప్పుకోటానికి తోవ లేమున్నాయో సమగ్రంగా వాడికి చెప్పవొచ్చు. నా ఈ ప్రయత్నాలవల్ల వాడికి మేలుకలుగుతుందో, లేదో నేను చెప్పలేను. ఐనా ఆ విషయం బొత్తిగా నాకనవసరం. వాడి సమస్యలూ, వాడూ కట్టగట్టుకొని ఏగంగలో దూకినా నాకభ్యంతరంలేదు. నాకు కావలసినదల్లా కాలక్షేపం. కేవలం కాలక్షేపం. ఈదృష్టితోనే, ఆ తెల్లవారి ఉదయమే ప్రయాణమయ్యాను. దోవలో వివిధ అనుమానాలు, జలగల్లాగా నన్ను పట్టుకొని వేధించాయి. నిజంగా నేనిప్పుడు వెళ్ళటం అనవసరమేమో? ఇంతకాలందాకా వాడా గోడవలతోనే సతమత మవుతుంటాడనేందుకు ఆధార మేమిటి? నావంటివాళ్ళే, వాడి కితర స్నేహితులు వుండివుండొచ్చు. వాళ్ళకూ ఈవిధంగానే ఉత్తరాలు రాయటమూ, వాళ్ళువొచ్చి, ఆసమస్యను బదాబదలు చెయ్యటమూ, ఇప్పటికే జరిగి ఉన్నపక్షంలో ఈ నా ప్రయాణమంతా శుష్కదండుగ ఐనా ఫర్వాలేదు. కొంతలోకొంతైనా అసలు సంగతేమిటో తెలిసిపోతుంది. కొన్ని రోజులపాటైనా సత్కాలక్షేప మవుతుంది.

నన్ను చూడంగానే చలపతి విపరీతమైన ఆనందాన్ని ప్రకటించాడు.

'ఒచ్చావా వొచ్చావా' అనే మాటలుగూడా సరిగ్గా అనలేకపోయినాడు. నా రాకవల్ల వాడుపొందిన సంతోషం చూస్తే వాడింకా ఆ వెధవ పీకులాటతో గిజగిజలాడుతూనే

ఉన్నాడని నేను గ్రహించాను. వాడింటికి లోగడ ఒక్కసారైనా నేను రాలేదు. వాడూ నేనూ, అయిదేళ్ళ కిందట ఒక్కే కాలేజీలో చదువుకొన్నాము. ఒకేగదిలో ఉన్నాము. వాడు దరిద్రుడు కానిమాట వాస్తవమేగానీ, పుష్కలంగా డబ్బు ఉన్నమాట మాత్రం అబద్ధం.

భోజనాలప్పుడు వాడిభార్యను చూడటం తటస్థపడ్డది. ఆమె అందగత్తె. అంతకుదప్ప ఎవ్వరూ, ఆమెనుగురించి ఎక్కువ చెప్పలేదు. ఆ పిల్లవలన వీడు పడుతున్న బాధ లేమిటో నాకు అర్థంకాలేదు. ఒకటిరెండుసార్లు ఆపిల్లను పరీక్షగా చూశాను. కాలి చిటికెనవ్రేళ్ళు భూమి నానుతున్నయ్యో లేదో పరిశీలించాను. నడిచేప్పుడు యామన్నా శబ్దం అవుతున్నదేమో విన్నాను. పెమ్యనాకుడులాంటి వక్ర చిహ్నాలకోసం గూడా ప్రయత్నించాను. అల్లాంటివేమీ నాకు కనిపించలేదు.

భోజనానంతరం వసారా గదిలో నాకమర్చిన మంచం మీద నడుంవాల్చాను. కంటికి నిద్ర రావటల్లేదు. కానీ క్షణ క్షణమూ ఆపిడరూపం నాకళ్ళల్లోకి రాసాగింది. ఆమె, అంత అందాన్ని స్వాధీనపరచుకొన్న చలపతిమీద నాకు అసూయ కల్గుతున్నది. వాడూ, ఆమే, కలిసి ఉన్నట్లూహించుకొని, ఉత్తేజితుణ్నయ్యాను. ఆమెప్రక్క, నన్ను నేనూహించుకొని కలలుకన్నాను. ఆమే నాభార్యఐవుంటే, నాజీవనం ఎట్లాఉంటుందోనని ఆలోచించాను. అటువంటి సుందరాంగిని పొందనిజన్మ జన్మేకాదని రూఢిపడ్డాను. కానీ, కానీ, చలపతి నామిత్రుడు, అతనేవేవో ఇబ్బందులలో వుండి నా సహాయం అర్థించాడు, వాటిని పరిష్కరించాలనే నిజమైన ఇచ్ఛ నాకు లేకపోవొచ్చు.

పరిష్కరణకు ఏప్రయత్నమూ చేయకపోవొచ్చు. కానీ వాణ్ని మరింత మనస్తాపానికి గురిచెయ్యటం భావ్యంగాదు. చివరికి ఒక నిర్ణయానికొచ్చాను. నేను ఆవిడకోసం ఏవిధమైన ప్రయత్నమూ చెయ్యగూడదు. తనంతట తాను ఆవిడే ముందు బైటపడే పక్షంలో కాలదన్ననూ కూడదు. ఈ నిర్ణయాని కొచ్చినతర వాత, మనస్సు ఒకరకంగా తేలికపడ్డది. ఐతే, మరొక దిక్కు మాలిన సందేహం నన్ను బాధించకపోలేదు. ఆమె నన్నెందుకు కోరాలి? కోరుతుందని నేనెందుకు ముందుగా అపోహపడ్డాను? చలపతికంటే, నేను అందగాణ్ణనే విషయం అట్లుండగా, వాడి కంటే డబ్బులోనూ, చదువులోనూ గూడా నేను అధికుణ్నే! ఈ కారణాలవల్ల ఆవిడ ప్రేమకు నేను అర్హుణ్ని కావొచ్చు. కానీ, ఆమె దృష్టిలో వీటికి విలువ లేనేలేదేమో! ఇటువంటివి ఆమె లోని ప్రణయాన్ని కదిలించలేవేమో? ఐనా ఇవన్నీ మరీ నీచపు ఆలోచనలు. ఒకానొక మిత్రుని భార్యనుగురించి ఇట్లా అను కొనటం బొత్తిగా కూడని పని. ఇటువంటి బుద్ధులు నాకు నేను ఎన్నో చెప్పుకొన్నాను. కానీ, వీటన్నిటినీ తప్పుకొని వెధవ మనస్సు—ఆమెచుట్టూ తిరగటం మానుకోలేదు.

సాయంత్రంపూట నేనూ చలపతీ రైలుకట్టను షికారు వొచ్చాము. వాణ్ని నేను జాగ్రత్తగా కనిపెడుతూనేఉన్నాను. ఎక్కడా ఉత్సాహంలేదు. వాడి నిరుత్సాహానికి కారణం బహుశా భార్యకు సంబంధించినది కావొచ్చు. ఏవిషయమూ ముందుగా నిర్ధారించుకోవటం తప్ప ఇందులో నేను తొందర పడటంగూడా అనవసరమే! ఎందుకంటే, బాధపడుతున్న వ్యక్తి,

అందులో నాసహాయ మపేక్షించిన వ్యక్తి ఈక్షణాన కాకపోయినా, మరోకొద్దిసేపటికైనా, తనంతటతాను బైటపడకపోడు.

నా అంచనా గురితప్పలేదు. ఇద్దరమూ సిగ్నల్ దాటి, చాలాదూరం వొచ్చిన తరువాత చలపతే ముందుగా ప్రారంభించాడు.

'కాని, చివరికిట్లా జరుగుతుందని నే నేమాత్రమూ అనుకోలేదు. అసలు నాకీ ఆలోచనే రాలేదు' అన్నాడు చలపతి ముఖం దిగులుగా పెట్టి.

నాకేమో అగమ్యంగా వున్నది. ఏవిషయం, ఎప్పుడు చివరికెల్లా జరిగిందో నేనెట్లా ఊహించను? నా అయోమయావస్థను చలపతి గ్రహించాడు గావును, సూటిగా నా ముఖంలోకిచూసి, బాధగా తలదించుకొన్నాడు.

'నాకు ఊళ్ళు తిరగటం యిష్టమైనప్పటికీ, మా మేనమామగారి ఊరుమాత్రం బొత్తిగా యిష్టంలేదు' అన్నాడు చలపతి. 'అప్పట్లో మా మేనమామకు జబ్బుచేసింది. ఆయనకు వేరేదక్షత లేకపోవటంవల్ల, కోలుకొన్నదాకా, పొలం వ్యవహారం నేను చూడాల్సొచ్చింది. అప్పుడే నాకీ పిల్లతో పరిచయమైంది.'

'ఏపిల్లతో...?' అన్నాను.

'ఇదే! తులసితో. ఒకరోజున నేను బావిదగ్గర నీళ్ళు తోడుతున్నాను. ఆపిల్ల నీళ్ళకోసంవొచ్చి దూరంగా నిలబడ్డది. అదే మొదటిసారి ఆమెనుచూడటం. అప్పుడే నేను చలించాను. నాలో ఇన్నాళ్ళనుండీ మరుగునపడివున్న ఏవో వాసనలు జ్ఞాపకంలో మెదలసాగాయి. కొన్నిరోజులు తరుచుగా కలుసుకొ

టుండేవాళ్ళం. కానీ, అట్టే మాట్లాడుకొనేవాళ్ళం కాదు. ఆమెను చూస్తుంటే, గొప్పప్రశాంతిలోకి వెళ్ళినట్లు ఫీలయ్యేవాణ్ని. ఏదో పవిత్రభావం ఆమెపట్ల, నాలో చోటు చేసుకోసాగింది. ఆమెఅంటే నాకుగొప్ప యిష్టమూ, ప్రేమా కలిగాయి' అని నా వేపు తిరిగాడు చలపతి '(పేమ–అంటే నువ్వు మరొకవిధంగా అనుకోబోకు. నా ప్రేమకు ఈ శరీరంతోటి సంబంధం లేదు. ఇంద్రియాతీతమైన. అదొక స్వచ్ఛందవాంఛ. ఆమె సుఖంకంటే నాకు కావలసిందేమీ లేదు ఆమె సంతోషంకంటే నేను కోర దగింది కూడా ఏమీ లేదు. వస్తుతః ఈభగవంతునిమీద నాకు నమ్మకంలేదని నీకు తెలుసుగదా! ఆమె జీవితం అన్నివిధాలా, సౌఖ్యప్రదం చేయమని ప్రతిరోజూ భగవంతుణ్ని ప్రార్థించే వాణ్ణి' అని ఆగిపోయినాడు చలపతి.

నాగుండెలు బొదబొదలాడినాయి చివరకు తులసి జీవితం ఎట్లపరిణమించిందో! చలపతి చెబుతూ, చెబుతూ మధ్యలో ఆపటము చూస్తే, తులసికి, ఊహించరాని ఆపత్తేమిటో సంభవించే ఉంటుందని తోస్తున్నది. చలపతి మళ్ళీ ప్రారంభిస్తాడేమోనని పదినిమిషాలు చూశాను. వాడిముఖం మరీ కుంగుకుపోయింది. బాధను బలవంతాన అణుచుకొంటున్నవాడిలా కనిపించాడు.

'ఇన్నిటికీ తులసి ఏమయింది చలపతీ? ఆమెగాని చనిపోలేదు...?' అంటున్నాను. చలపతి గట్టిగా నిట్టూర్పు విడిచాడు.

'లేదు. అట్లాగైనా బాగుండిపోను. ఒక ఏడుపేడిచి ఊరుకోవొచ్చు. అంతకంటే, దారుణమైన...' చెప్ప లేకఆగాడు.

'బహుశా...' అని నేనూ నీళ్ళు నమిలాను. ఆ తరువాత మాట ఏదైనా కావొచ్చు. మన దేశంలో ఆడవాళ్ళ జీవితాలు ధ్వంసంకానటానికి ఎన్ని మార్గాలు లేవు గనక! వాటిలో ఏవొక్కటో తులపి బ్రతుకును బద్దలుగొట్టి ఉంటుంది.

చలపతి చిన్నగుటక వేసి. తుంగ మొలకను పీకుతూ అన్నాడు.

'కానీ—ఇన్నిటికీ రోజులట్లా తీసుకొచ్చాయనుకో. అటువంటి విషఘుడియ ఒకటి ఉంటుందని నేనెప్పుడూ అనుకోలేదురా! ఆమె, నేనూ ఎన్నోసార్లు మా మేనమామ గారింట్లో కలుసుకొంటుండే వాళ్ళమని చెప్పాను గదూ! ఒకసారి మామూలుగా కూచొని ఉన్నాము. ఆమెతండ్రి చూశాడు. ఆమెను దారుణంగా కొట్టాడు. పెద్దగొడవ జరిగింది. వాళ్ళు చాల గౌరవస్థులు. అటువంటి 'అవమానం' వాళ్ళ వంశంలో ఏనాడూ లేనేలేదట. నేను ఎంతో చెప్పాను. ఎందరి దేవుళ్ళ మీదనో ఒట్టు వేసుకొన్నాను. ఐనా వాళ్ళు నమ్మలేదు. వాళ్ళే గాదు, మా మేనమామే నమ్మలేదు. ఆ పిల్లను ఇంట్లోంచి వీధిలోకి గెంటాడు తండ్రి. నేనెవరినిగురించి ప్రతిక్షణమూ, నమ్మకంలేని దేవుణ్ని ప్రార్థించనాగానో, ఆవ్యక్తి నాకళ్ళ ఎదుటనే ఇటువంటి 'నీచస్థితి'కి రావటాన్ని నేను చూడలేకపోయినాను. చివరకు ఆమెను పెళ్ళిచేసుకోక తప్పలేదు' అని మహాపరాధి లాగున బిక్కచచ్చిపోయినాడు చలపతి.

'ఓహ్హో! అదృష్టవంతుడివంటే నువ్వేనోయ్ చలపతీ!! ఏరి, కోరి తపస్సు చేస్తున్నటువంటి, అపురూప సుందరిని భార్యగా...' మిగతామాటలు అనలేకపోయినాను. అప్పటికే

చలపతి నావేపు చావు భయంతో చూస్తున్నాడు. వాడి భయానికి కారణం నాకు తోచలేదు. ఉన్నట్టుండి చలపతి కళ్ళు తడి చేసుకొన్నాడు.

'ఏమిటి చలపతీ?' అని బుజ్జగించాడు. వాడు కాసేపటికి తేరుకొని—

'నీకు 'ప్రేమ' అంటే ఏమిటో ఇంకా అర్థంగాలేదు. నీధోరణి చూస్తూవుంటే, నీజీవితాంతం లోగా నువ్వు దాని అర్థాన్ని తెలుసుకోలేవనే తోస్తున్నది. బహుశా నేను చెప్పబోతున్నమాటలు నీకు విచిత్రంగా ఉండొచ్చు. కానీ నాస్వానుభవంలోనించి చెబుతున్నాను. మన సాధారణ అంచనాలకు, ప్రవృత్తులకు, ఉద్దేశాలకు చాలదూరంగా ఉంటుంది నిజమైన ప్రేమ. శృంగార జీవితంలో అది దాదాపు తురీయావస్థలాంటిది. ఆమెను నేను గొప్పగా ఆరాధించాను. ప్రగాఢంగా ప్రేమించాను.' అంటున్నాడు.

'ఐతే ఇంక నువ్వు విచారించట మెందుకు? మాట పూర్తిగాకముందే చలపతి అందుకొన్నాడు.

'తెలీదు. అవును. నిజంగానే తెలీదు. ఎంతచెప్పీ, నీకు నేనది తెలియజెప్పలేదు. అదృష్టముంటే, నీఅనుభవమే దాన్ని నీకు నేర్పుతుంది. లేదా, కొట్లాది క్రిముల్లో నువ్వూ ఒకటవుతావు...సరే! పొద్దుబోయింది. ఇంటికెడదాం పద. మనకోసం తులసి కనిపెట్టుకొని ఉంటుంది. అందులో ఆమె నిద్రకు బొత్తిగా తట్టుకోలేదు

ఆ మర్నాటిఉదయం నేను లేచేసరికి చలపతి ఇంట్లో లేడు. ఏదోపనివుండి నాకంటే ముందుగానే లేచి వెళ్ళాడట.

ఒంటరిగా ఆయింటో కూచోబుద్ధి గాలేదు. నాలుగుబజార్లూ తిరిగి నేనింటికొచ్చేసరికి పన్నెండయింది. చలపతి అప్పటికే భోజనంచేసి వెళ్ళాడని తులసి చెప్పింది. నేనూ రెండుమెతుకులు కొరికి నడుంవాల్చాను—ఆసాయంత్రం గూడా చలపతి నాకు కనిపించలేదు. తిరిగి అతన్ని నేను చూసింది, రాత్రి పడుకో బోయేముందు మాత్రమే!

నేను అడక్కముందే చలపతి ప్రారంభించాడు.

'ఒక పనికోసం ప్రొద్దుణ్నించీ నేను తిరుగుతున్నాను. అదింకా పూర్తిగాలేదు. నాఆశలన్నీ, ఆమనిషిమీద పెట్టుకొన్నాను. నాదృష్టిలో అత నాపనిని నిరభ్యంతరంగా చెయ్యగల సమర్థుడు. ఏకారణంవల్ల, అత నాపని చెయ్యలేకపోయినాడో తెలీటంలేదు.'

'ఏంపని?' అన్నాను ఉండబట్టలేక. చలపతి నా వేపు చూసి నవ్వాడు.

'ఎంత వెర్రిప్రశ్న వేశావోయ్! అది పైకి చెప్పదగ్గదైతే, ఇందాకనే అనేవాణ్నిగదా పైకి. ఆమాత్రం ఆలోచించలేకపోయ్యావా??' ముందు నోరుమూసుకొని, తరవాత కళ్ళుగూడా మూసుకొన్నాను.

ఆమర్నాడు, ఆతరవాత రోజుగూడా, చలపతి నాకు కనిపించలేదు. ఆపనేమిటో ఇంకా పూర్తికాలేదుగావును, ఆచేసే వాడెవడో వొట్టి నాపయి ఉంటాడనిపించింది నాకు. ఇష్టమైతే చకాపికీ చేసేయ్యటమూ, లేదా, నావల్లకాదనటమూ ఐతే బాగుండునుగదా! ఇట్లా నలుపుడు బెట్టి చంపకుండా? ఏతిపనైనా నా కవసరంలేదు గానీ, నే నాసించినంత పెద్దమొత్తంలో—

కాలక్షేపం దొరకలేదు వాడేమో, తనపనితోనే సతమతమవు తుండే, ఇంటోచూద్దామనూ నేనొక్కణ్ని, రామాలయమును, జువ్విచెట్టునూ, ఎన్నిసార్లుచూడగలుగుతాడు ఎవడైనా? ఇక పీఠం ఎత్తి వేద్దామనుకొని ఒకరోజు రాత్రి కాపలాతో చలపతిని పట్టు కొని చెప్పాను. వాడు రెండుమూడు నిమిషాలు నన్ను నెమ్మ దిగా చూసి, ఐనా రేపు, ఎల్లుండిగూడా ఉండు. నువ్విప్పుడు వెళ్ళి అక్కడ చక్కబెట్టే పనులేమీ లేవుగదా!' అని దులప రించుకొని వెళ్ళిపోయినాడు. వాడు గతవారంనుంచీ ఇంట్లోనే పడుకోవటంలేదని ఆతరవాత తులసి చెప్పింది. చలపతిని ఈ విధంగా నిద్రాహారాలకు దూరంచేసిన ఆ పని ఎటువంటి చిక్కు లమారిదోగదా!

ఒకరోజు ఉదయం రేజర్‌కోసం పెట్టె తెరిచాను. అందులో నాకు తెలీని కాగితాలేవో కనిపించాయి. తీశాను, మొదటిపేజీమీద వ్రాత నన్ను సంబోధిస్తోనే ప్రారంభమైంది.

'——! నువ్వంటే నాకు మొదటనుండీ గౌరవమున్నది. నువ్వే నాదృష్టిలో, నాకంటే అన్ని విధాలా ఉన్నతుడివి. అందుకే నా వివాహమైన తొలిరోజుల్లోనే నీకు ఉత్తరంరా శాను. నువ్వురాలేదు. అప్పటినుండీ, నేను నా అన్వేషణ ప్రారంభించాను. నువ్వు కొన్ని విషయాల్లో వొట్టి అర్భకుడివి. నీదృష్టి పరిమితమైన పరిథిలోనే తిరుగుతుంటుంది. దానికావల గూడా సుందరాలు, ఆనందాలు ఉంటయ్యాని నువ్వూహింపలేక పోతున్నావు. నేను తులసిని గాఢంగా ప్రేమించాను. ఆమె ఆనందంకోసం నే నెటువంటి త్యాగానికైనా సిద్ధంగాఉన్నాను. కానీ నాత్యాగాన్ని అందుకోగల వ్యక్తి ఇంతవరకూ దొరక

లేదు. నిజమైన ప్రేమకు 'స్వపర' భేదముండదు. నిజమైన ప్రేమ; ఎదుటి వ్యక్తినుండి సౌఖ్యాన్నో, ఆనందాన్నో పొందటముకంటే, ఎదుటివ్యక్తికి శాయశక్తులా ఆనందాన్ని అందివ్వటానికే ప్రయత్నించటం జరుగుతుంది. ఆమనిషినుండి నే నెంత సుఖం గుంజుకొంటున్నాను? అనే ప్రశ్నే రాదు. ఆమనిషికి నే నెంత సుఖాన్నిస్తున్నాను? ఎంత యివ్వగలను? అనే ప్రశ్నలే ఉంటాయి. ఆమెనుండి నేను కొంతసుఖం పొందుతున్నాను. ఆ మాటకాదనటంలేదు. ఆపాటిసుఖం నాకే స్త్రీఐనా యివ్వగలుగుతుంది. అందుకోసమని తులసిని నా'స్వంతం' చేసుకోటము నా కిష్టంలేదు. కానీ తులసికి నేనేమిస్తున్నాను? నానుండి ఆమె గూడా కొంతసుఖాన్నో, లేక సుఖంలాంటిదాన్నో పొందుతుండవొచ్చు. అది ఆమెకు సంతృప్తికరంగానే ఉండవొచ్చు. ఆమెకున్న పరిమితమైన సంస్కారం; ఆమె మనస్సుకు, తను అనుభవిస్తున్నదే సౌఖ్యమని చిచ్చుగొట్టవొచ్చు. కానీ నాకు గాదు. నేను ఇంతటితోనే ఆగిపోలేదు. ఎందుకంటే ప్రేమరాసి అల్పసంతోషి, మూర్ఖురాలూ ఐవుండగూడదు. ఆమె అనంతమైన సౌందర్యాలలోకి ఆనందములలోకి, తనను తను జేర్చుకోవాలి. అందు కామెసంస్కారం ఒప్పుకోకపోతే, నేనైనా ప్రోత్సహిస్తాను. నీకదంతా కొత్తగా ఉంటుందనుకొంటాను. కానీ చాలా ఖరీదైన సత్యమిది. ఆమెను నేను సుఖపెట్టుటలేదేమోననే గుడ్డినమ్మకం నన్ను వేధించసాగింది. నా ప్రణయరాణి, సాధారణ స్త్రీలాగా బ్రతకటం నాకిష్టంలేదు. అందుకనే, నాకంటే ఉన్నత వ్యక్తికోసం నేను వెతకటంగూడా. ఇప్పటికైనా నన్నునువ్వు అర్థం చేసుకోగలిగితే ధన్యుణ్ణి. నిన్ను ఎప్పుడోరమ్మని

రాశాను. ఇప్పుడొచ్చావు. నీకు ఎన్నో నిరపాయమైన అవకాశాలిచ్చాను. నువ్వు గ్రహించుకో, గ్రహించకపోగా నా ఆ అవకాశాలను వినియోగించుకో లేదు. ఈ కాగితాలు చదవడం పూర్తయిన తరువాత, నిరభ్యంతరంగా నువ్వెళ్ళిపోవొచ్చు. నీలాంటి '—'తో నాతులసి ఏమీ సౌఖ్యపడబోదని, నేను గ్రహించగలిగాను. సుస్థిరంగా నాతులసి సౌఖ్యపడగలగటానికై, తిరిగి నేను నా అన్వేషణను ప్రారంభించాను. శలవు.

చదవటం పూర్తిచేశాను. తల గ్లోబులాగా తిరిగింది. ఒకానొక కొత్తదనం మెత్తగా హృదయాన్ని తడుతున్నది. మహోన్నతమైన ప్రేమశిఖరాన్నధిరోహించిన చలపతిరూపం గంభీరంగా నాకళ్ళముందు నిలిచింది. ఏదో సరిక్రొత్త కాంతి నాలోకి ప్రవహిస్తున్నట్లు, అనుభవించాను. చేతిలోనుండి కాగితాలు క్రిందకు జారాయి.